1

# శ్రీ మైత్రేయ సంగీత, నృత్య రూపకాలు

"అర్థేచా నాతి చరామి"

"పుష్ప సందేశం"

"మృచ్ఛ కటికం"

"కాకమ్మ"

రూపకాలు (వ్యాసం)

శ్రీ నాట్యకళా నిలయమ్ సౌజన్యంతో

శ్రీ విజయకృష్ణ పబ్లికేషన్స్

విశాలాంధ్ర రోడ్, విజయవాడ—4.

ప్రథమ ముద్రణ : 1986 జూన్

కాపీలు : 1000

ముద్రణ : వెంకటరత్న, విజయవాడ–2

ముఖపత్ర రచన : "భరణి"



వెల : ఎనిమిది రూపాయలు

---

First Edition : 1986 June

Copies : 1000

Printing : Venkata Ratna, Vijayawada-2

Cover Design : "Bharani"



Price : Eighte Rupees

## మా మాట

శ్రీ మైత్రేయ రచించిన గేయ రూపకాలు ప్రచురించుచున్నందుకు సంతోషిస్తున్నాం. సాహిత్యముతో ఏ కొద్ది పరిచయం కలవారయినా ఎంతో ఆనందిస్తారు చదివితే.

సినిమా సాహిత్యం, దినపత్రికల రచనా శైలి నేడు అందరికీ అందిన జీవ సాహిత్యం. అదనపు విలువలు సాధించ దలచినవారు సాహిత్యములో ఎన్నెన్నో లోతులు చూస్తారు, విలువ సాధిస్తారు.

ఈ రూపకాలలో "అర్థేచానాతి చరామి" నేటి సాంఘిక నరకాన్ని చిత్రించిన కథనం—"పుష్ప సందేశం" నేటి అపనీతి ధ్యాసల్లో పెరుగుతున్న 'అమానుషానికి ప్రతీక— "మృచ్ఛకటిక" ప్రపంచ సాహిత్యంలో పేరెన్నికగన్న భారతీయ నాటకరత్నం—"కాకమ్మ" జానపద నృత్యకేళిక. కరుణారస ప్రధానమైన బలహీనుల మనోభావానికి అది సదాచారం ఇక చివరిది "రూపకాలు" వ్యాసం, నేటి పాఠకలోకానికి సంగీత నృత్య నాటక రూపకాలు ఏనాటి నుంచి ఎలా ఉండాయి- ఈనాడవి ఎలా విలసిల్లాయనే పరిశోధనాత్మక వ్యాసం. ఇది చదువరులలో గొప్ప అవగాహన కల్పించి కొత్త ఆలోచనలను కలిగిస్తుంది.

ఈ గేయ రూపకాల పుస్తకాన్ని తెలుగు పాఠకులు ఆదరిస్తారని ఆకాంక్షిస్తున్నాము.

ప్రకాశకులు

నా మాట

ఈ రూపకాలు నాలో చాలా కాలంగా దాగివున్నాయి. కావ్యాలు ప్రాచీన సాహిత్యంలోని సొగసులు తెలుసుకోవటంకోసం చదివాను. నాటకాల్లో రత్నాలవంటి వున్నాయి, అవి మన జనాలకు తెలియవు. నేటి బ్రతుకుతెరువు నేర్పిన అనేకమందికి ప్రాచీన సంపదపట్ల తేలికభావం! అది చాలా బాధ కలిగిస్తుంది.

మిత్రులు శ్రీ జె. వి. శర్మ తమ 3వ వార్షికోత్సవంతో 'శాపం తలం' నృత్య నాటిక రాయించి ప్రదర్శించారు. 4వ వార్షికోత్సవంలో 'అర్చానాతి చరామి' రాయించి ప్రదర్శించారు. నాకు చాలా ఆనందం కలిగించింది. రాసింది ప్రదర్శిస్తుంటే చూచుకోడం రచయిత అదృష్టం-మృచ్ఛ కటికం ప్రదర్శించవలసి వుంది. పుష్పసందేశం, విజయవాడ ఆలిండియో రేడియో వారి ఆమోదంపొంది ప్రసారం చేయబడింది (సంక్షిప్తంగా.) శ్రీ మల్లాది సూరిబాబుగారు దానికి సంగీతం సమకూర్చారు. వారికి, విజయవాడ రేడియో కేంద్రం వారికి కృతజ్ఞతలు.

ముఖ్యవిషయం శ్రీ నాట్యకళా నిలయమ్ 5వ వార్షికోత్సవంలో ఈ గ్రంథం (శ్రీమైత్రేయ రూపకాలు) ఆవిష్కరించబడడం ఆనంద దాయకం. శ్రీ శర్మగారు దీని ముద్రణకు వెయ్యిన్నూట పదహార్లు అందజేయటం-ఇది శ్రీ శర్మలోని సాహిత్యాభిలాషకు-ఔదార్యానికి-సత్వానికి మచ్చు మాత్రమే. మా యిద్దరిమధ్య ఋణ ప్రసక్తిలేదు. కాని పరస్పర కృతజ్ఞతా భావం అవశ్యం. అతని ఆదరాభిమానానికి కృతజ్ఞాంజలి.

పాఠకులు ఈ మాదిరి సాహిత్యంతో పరిచయం లేనివారు మొదట చివరి వ్యాసం చదవండి. కూసరాగంతో ఈగేయ సంపదను మీ నాలుకపై నాట్యమాడించండి. మీకు తెలియని అనుభూతి, మీ జీవితంలో మరువలేని ఆనందం పొందుతారు.

ప్రదర్శించ దలచినవారు సినిమా పాటల ట్యూనులతో వీటిని చిత్రవధ చేయకండి. సంగీతం తెలిసినవారితో స్వర రచన చేయించండి. అవసరమైనచోట్ల అక్షరాలు మార్చుకోండి భావం పోకుండ-శలవు.

ఇట్లు
శ్రీ మైత్రేయ
జూన్-1986

డి. ఎస్. యం. హైస్కూలువద్ద
విద్యాధరపురం
విజయవాడ-12

# "అర్థేచా నాతిచరామి"

[సాంఘిక నృత్య నాటిక]

రచన:

శ్రీ మైత్రేయ

సంగీతం:
శ్రీ డి. వీరభద్రరావు

దర్శకత్వం:
శ్రీ జె. వి. శర్మ

ఇందులో

| | |
|---|---|
| విజయ | [కోడలు] |
| రంభ | [అత్త] |
| సత్యవతి | [విజయతల్లి] |
| విరూపకుమార్ | [విజయభర్త] |
| పేరయ్య | [పెళ్ళిళ్ల పేరయ్య] |
| సత్యారావు | [విజయ తండ్రి] |

[ఇంకా ఇరుగుపొరుగు-ఇతరులు అవకాశాన్నిబట్టి రావచ్చు.]

నేటి సమాజంలో స్త్రీ ధనంకోసమే భార్యగా చేపట్టిన వ్యక్తిగా వున్నది. "ధర్మేచా, అర్థేచా, కామేచా, మోక్షేచా, నాతిచరామి" అనేది పెళ్ళినాటి ప్రమాణం. "డబ్బు, కోరికలు, మోక్షం విషయాలలో ఆమెతో ధర్మంగా వ్యవహరిస్తానని దాని అర్థం. ఇప్పుడు డబ్బుకోసమే స్త్రీని చేపట్టిన అర్థంలో దాంపత్యం ప్రారంభమవుతున్నది. అందుకే "అర్థేచానాతిచరామి" శీర్షికను ఈ రూపకానికి వుంచాం.

# అర్థేచా నాతిచరామి

[ఒక స్త్రీ పురుషుల జంట- లేక -సత్యవతి, సత్యారావుల ప్రవేశం]

విజయీభవా! జయ విజయీభవా !
విజయీభవా ! సుజ్ఞాన సుజనులారా !
వందనాలు అందుకోండి సహృదయులారా !
సభనలంకరించిన బుధజన కోవిదులారా !
ఈకథ వినండీ ! మన కథలే కనండి ! ।వి।

పురుషుడు :

ఎదిగిన కూతురు ఇంట నుండ
ఏల వుంచుకొందుము మనము
తగిన వరుని చూచి అక్షింతలు వేసి
అంపుదము — మెట్టిన ఇంటికి ।ఎదిగిన।

స్త్రీ : ఆటలందు నెమలి
పాటలందు కోకిల
పలుకులందు రాచిలుక
నడకలందు రాజహంస ।ఎదిగిన।

పురుషుడు :

ఇరువది ఏండ్ల పసిడి వయసుకు
ఆ వయసు తెచ్చిన యౌవ్వనము
విజ్ఞానపు మకరందము
చంద్రికా సౌగంధము కలది ।ఎదిగిన।

[పెళ్ళిళ్ళ పేరయ్యా దారిన పోతూ వారినిచూచి దగ్గరకు వచ్చాడు.]

పేరయ్య :

పెళ్ళిళ్ళ పేరయ్యా నొచ్చాను
ఎడా పెడా పెళ్ళిళ్ళు చేయిస్తాను ॥పెళ్ళిళ్ళ॥
పెళ్ళికి మీ ఇంట పిల్లలున్నారా !
వరులున్నారా ! లేక వధువులున్నారా !
ఆడపిల్లలకి వరులున్నారు
మగపిల్లలకి వధువులున్నారు
బంధాలు — అనుబంధాలు
చక్కగ నే సమకూరుస్తాను ॥పెళ్ళిళ్ళ॥

సత్యారావు, సత్యవతి :

అందాల బాల మా విజయ
వరుని గృహానికి గృహలక్ష్మి
విద్యలందు శార్వాణి-గీర్వాణి
హోమ్ సైన్సులో పట్టభద్రురాలు ॥ అం ॥

పేరయ్య :

ఒక అబ్బాయి వున్నాడు బహు సుందరుడు
విద్యలందు బ్రహ్మనే మించినవాడు ॥ఒక॥
సంపదలో కుబేరునే అంతినవాడు
మీ అమ్మాయికి జోడై ఆదర్శముతో మనగలడు
॥ఒక॥

సత్యారావు :

పాతిక వేలు కట్నం — తగినంతగ సారె

లాంఛనలన్నీ కలసి కట్నంమాత్రం అదే అదే ॥

సత్యారావు, సత్యవతి :

మా తదనంతరమందున్న మా ఆస్తికంత

విజయపేర విల్లు రాసినాము ॥పాట॥

పేరయ్య : [వస్తూవున్న రంభను గమనించి]

ధన-కనక-వస్తు-వాహనాది సకలసంపదల తులతూగు

తోన్న దేవి! రంభాదేవి స్వాగతం! సుస్వాగతం!!

(రంభ సభాప్రవేశం - విరూప కుమారునితో)

రంభ : రంభా వెడలే తరికిటతోం

రంభా వెడలే — రాచమార్గమున

వధు అన్వేషణకు ॥ రంభ ॥

రంభ వెడలె - వధు తేజము లారగ

రంభ వెడలె - పెండ్లి చూపులు చూడగ

తల్లిదండ్రుల గుండె దడగా

గుండెఃదరగా అదరి బెదరగా

విరూపకుమారు వెంటనిడుకుని ॥ రంభ ॥

[బ్రాండు మ్యూజిక్-మైంలో పరామర్శలు అంగీ

కారాలు జరిగాయి.]

పేరయ్య : "మాంగల్యం తంతునానేన మమజీవన హేతునా!

కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరశ్శతం"

(సూత్రధారణ మైంలో జరిగిపోతుంది).

సత్యారావు : "ధర్మేచా అర్థేచా మోక్షేచా కామేచా

నాతిచరితవ్యా"

విరూప: (తల్లివంక చూస్తూ అంటాడు)
"అర్ధేచా నాతిచరామి"
(లైట్స్ ఆఫ్)
(విరూప కుమారుడు అలుక పాన్పుపై అలిగికూర్చు న్నాడు)

సత్యవతి,సత్యారావు :
అదేమి నాయన అలుక ఎందుకు
కట్నాలిచ్చాం లాంఛనాలతో
అలుక న్యాయమా! నీవలుగ న్యాయమా ॥అదే॥

విరూపకుమారుడు :
కట్నం సంగతి అమ్మకు తెలుసు
లాంఛనమేగా నేకోరేది ॥కట్నం॥
టీవీ-స్కూటర్-గ్రైండర్, ఫ్రిజ్జూ
మోజుగ ఇవ్వండి ఇప్పుడు
నేను అలుక మానుతా ! ॥కట్నం॥
(సత్యవతి - సత్యారావు వెళ్ళిపోయారు - విజయ ప్రవేసించింది).
(లైట్స్ ఆఫ్ - లైట్స్ ఆన్)
(విజయ విరూపకుమార్ హాయిగా వుంటున్నారు.)

విజయ: చల్లని తెల్లని వెన్నెలరేయీ
మనసూ తనువూ త్రుళ్ళి తేలించరావోయీ
॥చల్లని॥
నా మనసు దోచిన శృంగారరాయడా !
చెరుకు - విల్లు దాల్చిన చెలికాడా !

(జతి)

గడుసు తుమ్మెద వంటి గంధర్వరాయా !
హాయను రయముల మించు శృంగార దేవుడా

(స్వరం) ॥చల్లని॥

(విజయ విరూపకుమారుని ఆనంద బృందావనంలో
ఆనందింపజేయుచుండగా రంభ ప్రవేశించింది)

రంభ : ఓసోసి వగలాడి — నేరని నేరజాణా
మగని కొంగున గట్టు మాయలు చాలింపు
॥ఓసోసి॥

చచ్చి కట్నము తెచ్చి సర్వసుఖములు తేల
పన్నాగము సాగదు — నీవుపో వే కారుచుతేవే ॥ఓసోసి

విజయ : న్యాయమా తల్లిని బోలిన తల్లి వే అత్తమ్మ
నీవిటుల పల్కుట న్యాయమా ॥న్యాయమా॥
ఉన్నదంతా ఊడ్చి ఇచ్చిరి తల్లి తండ్రులు
తలదాచుకొన పూరి కొంపయునా లేదు
॥న్యాయమా॥

రంభ : ఎవరు చెప్పతావా? నన్ను దెప్పతావా ?
తన్నరా విరూపా దీనిని
తన్ని తగిలేయరా దీనిని ॥ఎవరు॥

విరూప: దయతలచవే అమ్మ దయతలచవే
కోడలంటే ఇంటి ఇలవేల్పు గాదటే ॥దయ॥

రంభ : నోరు ముయ్యరా పిరికినన్నాసి
మందు పెట్టె నీకే మాయలాడి ॥నోరు॥

పోతె పోనీర పీక పిరగడై పోవు
నుఁరొక పిల్లను ఇప్పుడే తెచ్చి
మంచిగా పెళ్ళి చేస్తారా ॥పో॥

విజయ: న్యాయమా ! అన్యాయమా!
యోచించుమా అత్తయ్యా !
ఇంటికోడలినిట్లు చేయుట
ఎవ్వరూ మెచ్చరమ్మా—
ఆశలన్నీ జీవితాంతము
అనుభవించగ వచ్చితమ్మా
ఆరునెలల అనుభవముతో
నూరువళ్ళు నింపుకోనా ? ॥న్యాయ॥

రంభ : పోవె పోవె మర్యాదగ
మూరుకల్యాణి — పుట్టినింటికి
పోకపోతె నిన్ను తన్ని తరిమేస్తా ॥పోవె॥

(విజయా జుట్టుపట్టి ఈడుస్తుంది)

( లైట్స్ ఆఫ్ )

(సత్యవతి-సత్యారావు, స్త్రీ పురుషులు వచ్చారు)

సత్యారావు :
సాంప్రదాయము నమ్మి
సర్వస్వమును అమ్మి
బిడ్డ భవితను కూడ
కాపాడుకోలేమా ? ॥సాంప్ర॥

ప్రజలు : అన్యాయం ఎదిరిస్తాం
ధర్మాన్ని సాధిస్తాం

కన్న బిడ్డల కలలు
కాలిపోనీయము ॥అన్యా॥

(కోరస్)

సత్యపతి : రంభరావే రచ్చకీప్పుడు
(అందరూ సంతపాడతారు)

బిడ్డను రక్షించ మేము
సిద్ధమై వచ్చాము ॥రంభ॥

రంభ : అయ్యొయ్యొ అయ్యొయ్యొ
ఇదేమి చోద్యం ఇదేమి చోద్యం ॥అయ్యొ॥
అన్నము వున్నము ఎరుగని నన్ను
రచ్చకీడ్చుతారా ? రభస చేస్తారా! ॥అయ్యొ॥
అసలు ఇంతకీ సంగతి ఏమొ ?
అడిగి తెలుసుకోరా !
పోమరికూతురు మాటలు వింటు
నడివీధికి వస్తారా ! ॥అయ్యొ॥
కన్న బిడ్డ కంటె మిన్న నా కోడలిపిల్ల
కంటికి రెప్పనుగానా నే కోడలి పిల్లకి
॥అయ్యొ॥

విజయ : వింతగున్నదమ్మ నాకు నా జీవనయాత్ర
అత్తమాటల కర్థం నేను చదువలేను ॥వింత॥
విడాకు లిమ్మని వెడలిపొమ్మని
జుట్టుకట్టి ఈడ్చె పతిని కలువకూడదని___
ఊరి తాడుకు వుసిపెట్టక వేగమె పొమ్మని___
ఎన్నెన్నొ అన్నదీ ఈ వింత చిత్తము ॥వింత॥

రంభ : హాసవు పరిహాసవు మాటలన్న నమ్మి
అమ్మ నాన్న నమ్ముల రచ్చకీడ్చుతావా ॥హాసవు॥
సత్యవతి : నీపరిహాసం తెలియని నా బిడ్డను
హాస్యంతో హడలగొట్టకు వియ్యపురాల ॥నీపరి॥
హాస్యానికి హద్దు పెట్టు వియ్యపురాల
కయ్యాలకు కాదు సమయం కాదు ఏవేళా ॥నీపరి॥

సత్యారావు :
తెలిసియో తెలియకో తప్పు చేసినా
నీబిడ్డగ చూడుమమ్మ మా బిడ్డను ॥తెలిసియో॥
ఇచ్చుటకు మానద్ద ఏమీ లేదు
మా సర్వం ఈమెయె - మాకిక శెలవు
శెలవు - శెలవు - శెలవు

రంభ : సాగనంపిరార - నా వియ్యాపా
అత్తామామా పెద్దల అందాక ॥సాగ

(అందరూ వెళ్ళిపోయారు — విజయ—రంభ వున్నారు)
రంభ : ఏమి కూస్తున్నావే ఏమి చేస్తున్నావే
వేదాంత తత్వాలు నీవు వల్లిస్తావా ॥ఏమి॥
అత్తమన్నానన్న భయమె లేదే నీకు
భర్త దేవుండనే భావమే తెలియదా ॥ఏమి॥
అమ్మనాన్నల చేర్చి ఆడావు నాటకం
నీ నాటకము నేను పూర్తి చేస్తాచూడు ॥ఏమి॥

(హింసించనారంభించింది రకరకాలుగా)

యివ్వాలె విడాకులు ఇప్పుడే ఇచ్చాటే
కోరికలు చంపుకో కొంగుతో ఉరివేసుకో

విజయ : ఏమంటున్నావమ్మ అత్తమ్మ
నా దెవ్వుంను వమ్ము తేస్తున్నావు
హాస్యము ఆడానన్నావు ?
నరహింసకు తలపడుతున్నావు ॥ఏమం॥

విరూప : వూరుకోవె అమ్మ నీ వుపకారం చాలు
బతికిపోనీయవే బాధపెట్టకే ॥వూరు॥

రంభ : పోరా విరూపా ఇచట నుండి
ఈ శని పీడ తొలగిస్తాను ॥పోరా॥
అమ్మ నాన్నల పోగుచేసి
నన్న కాదన్ని - యాగిచేసి ॥పోరా॥
తలదన్ని నదానిలా (నా)॥
కులుకుతోంది - నా కడుపు వుడుకుతోంది ॥పోరా॥

విజయ : అమ్మవనుకున్నాను అత్తమ్మ నిన్ను
ఈ ఇంట నీకంటె నాకు దక్కేవరు! ॥అమ్మ॥
బ్రతకాలనే ఆశ బహు తీపి నిచ్చింది
చంపుతావంటె నా ప్రాణ మల్లాడింది ॥అమ్మ॥
డబ్బుకోసం నీవు ఏమైన చేస్తావా ?
కడుపుతో వున్న కోడలికి కాదు పేరుస్తావా ?
॥అమ్మ॥

అత్తయిన ఆడదేనని ఆమె ఒక కోడలేనని
కోడలంటే యింత క్రూరంగ వుండదనుకున్నాను
॥అమ్మ॥

"అర్థేచ నాతిచరామి" అని బాస చేసి
నన్ను విస్మరించి - ఈ శిక్ష
సేయుట న్యాయమా ? ||అమ్మ||

(విజయ కుమార్ తల్లిని బ్రతిమిలాడుతుండగా లైట్స్ ఆఫ్)

(కొన్నాళ్ళ తరవాత ఒకరోజు. విజయ గర్భవతిగా వుంది)

రంభ : బ్రతకనివ్వనే నిన్ను ఇంకొక్క నిముసము
బ్రతికిబయటపడితే-చంపుతావు నన్ను ||బ్రతక||
కోటివన్నెల కోడలొస్తుంది నాకు
కథలసల్లి నాగు కరుణ పుట్టించకే ||బ్రత||
(హింసిస్తుంది రకరకాలుగా)

విజయ : అమ్మనుకున్నాను అత్తమ్మా నిన్ను
మాఅమ్మ నొకసారయిన చూడనీనన్ను ||అమ్మ||
అమ్మనాన్నలకడకు నే వెళ్ళిపోతాను
నీవు కోరినరాత నే రాసి ఇస్తాను ||అమ్మ||
చంపకమ్మా నన్ను బ్రతుకు తీపిగ వుంది
నా బిడ్డతో నేను జీవించితేచాలు ||అమ్మ||
భర్త కంటికి నేను కనబడక పోతాను
భర్త అత్తల సుఖము నేకోరుకుంటాను ||అమ్మ||

రంభ : బ్రతకనివ్వనే నిన్ను - ఇంకొక్క నిముసము
(హింస పెడుతోంది)

విజయ : చంపకమ్మా నన్ను - బ్రతుకు తీపిగ వుంది
(హింసను ఎదుర్కొంది)
(ఇరుగు పొరుగు ప్రజలు వచ్చారు)

ప్రజలు: అన్యాయం సహించం
అక్రమాల్ని సహించం
ఇది పూరనుకున్నావా ?—
వల్లకాడనుకున్నావా ? ॥అన్యా॥
ఒక ఇంటి ఆడపిల్ల
మరో ఇంటికోడలు
తరతరాల బంధమిది
తెగని సంబంధమిది ॥ ॥అన్యా॥

విరూప: పాలుతాగు పిల్లిలా
కళ్ళు మూసుకున్నావమ్మా
కుండమూతకలవు గాని
లోకం మూయలేవమ్మా ॥

(విరూప-విజయను తీసుకుని ప్రజల్లో కలిశాడు)

ప్రజలు: సాంఘిక నేరాలను అరికట్టాలి॥
ధనదాహపు విపరీతం అరికట్టాలి ॥
అత్తల ఆఘాయిత్యమంత మొందాలి॥
నేరస్తులు శిక్షార్హులు కావాలి॥
నేరస్తులు శిక్షార్హులు కావాలి ॥

(అందరూ పంభను బంధించారు-అందరూ ఫ్రీజ్ లో వుంటారు) —లైట్స్ ఆఫ్—

[సమాప్తం]

# పుష్పసందేశం

సందేశం అందించటానికి మార్గాలు అనేకం! కాని సున్నిత హృదయాలకు సంకేతంగా పుష్పాలను స్వీకరించడం జరిగింది. పూజ్యులు "కరుణశ్రీ" జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు మానవులు అమానుషంగా ప్రవర్తించడాన్ని శృంగార సంబంధ విషయాలకు తమను ఎలా వాడుకుంటారో కరుణ రసభరితంగా చెప్పారు "పుష్ప విలాపంలో." అది లోకం మెచ్చింది. ఒకచోట "నరజాతికి నీతి యున్నదా?" అని కూడా ప్రశ్నిస్తారు—

నేను దీనిని అనాధశరణాలయాల పేరిట అబలలపైన, ముక్కుపచ్చలారని బాలికలపైనా జరుగుతున్న అత్యాచారాలు ధ్వనించేలా చిత్రించాను. అయితే అత్యాచారాలను చిత్రించలేదు. అవి అనవసరమని భావించాను. పాఠకుని మొద్దుమనసును ఆలోచింపచేయటం మంచిమార్గమని, బలాత్కారాలు, మానభంగాలు అక్షరాకృతిలో చూపి బలహీనులైన పాఠకులను అనవసరంగా రెచ్చగొట్టరాదని నా భావన. సాహిత్యంలోనూ నాటకంలోనూ సృష్టించిన రసానుభూతి ప్రేక్షకునిలో నిద్రాణమైవున్న శక్తుల్ని ఉద్రేకపరుస్తాయి. ముఖ్యంగా హాస్యం అన్ని వయసుల వారికి, శృంగారం వయసువున్న వారికి అందుతాయి. దుఃఖం పాఠకులను ఆకట్టుకుంటుంది. కరుణరసం పాఠకుల సంస్కారాన్ని కొలుస్తుంది. సాహిత్యం ఎప్పుడూ పాఠకుని స్థాయిని బట్టి ప్రయోజనం సాధిస్తుంది.

ఇందులోని పూలన్నీ అన్ని వయసుల బాలలుగాను, తోటమాలి ధనిక స్వాముల దాస్యం చేసే మేధావిగాను భావించగలిగితే "పుష్పాల సందేశం" అందుతుంది.

(29-9-79 న ఆకాశవాణి విజయవాడ కేంద్రం బొమ్మరిల్లు పిల్లల కార్యక్రమంలో ది 7-1-80న కార్మికుల కార్యక్రమంలో సంక్షిప్తంగా ప్రసారం చేయబడింది.)

ఆకాశవాణి విజయవాడ కేంద్రం వారికి కృతజ్ఞతలు.

ఇందులో—

వ్యాఖ్యాత, తోటమాలి, పువ్వులావికలు, పూబాలలు.

దృశ్యం : పూలతోట

వ్యాఖ్యాత :

"అది ఒక తోట. ఆ తోటలో పూబాలలు ఆనందంగా ఆడుకుంటున్నాయి. తోటమాలి వచ్చాడు. బాలలను చూచి ఆనందించాడు"

తోటమాలి : (వచ్చి-వ్యాఖ్యకు అనుకూలంగా నటించాడు)

పూబాలలారా ఓ
పువ్వులాలినులారా ॥పూ॥
ఆడేపాడే ఈ కులో
ఆనందం పొందే మనసుల
అంద చందాలు మీరేలే
దొరలు పెంచు ఈ బృందావనికి
శృంగారానికి సుందరాంగులు
మీరేలే! మీరేలే! ఇట

శోభకః రాణులు మీరేలే ||పూ||

వ్యాఖ్యాత :

"పూబాలలు తోటమాలి ప్రశంసలు స్వీకరించాయి. ఆనందించాయి."

పూబాలలు :

అవునూ.........
అందం కొరకే మా అవతరణా
ఆరోగ్యం ఆనందం పంచి, మేము
మానవ ప్రాణుల పోషించేము
పేద ఇల్లయినా ప్రభువు ఇల్లయిన
మాధర్మం మేము నెరవేర్చేము ||అం||

వ్యాఖ్యాత :

"తోటమాలి పూబాలల ఆనంద ప్రవచనాలు స్వీకరించాడు. మరొక్కసారి ప్రశంసించుతున్నాడు"

తోటమాలి :

పూబాలలారా ఓ
పుష్పలాలినులారా ||పూ||
ధనిక స్వాముల ఆవరణంలో
ఆనందంతో విలసిల్లేరు
అందమయిన ఈ సౌధాంగణమును
బహుసుందరముగ వెలయించారు
తోటలు పేటలు కోటిబాటలు
అంతట మీరే అలంకారము ||పూ||

వ్యాఖ్యాత :

"పూబాలలు తోటమాలి ప్రశంసలను చాలా సంతోషంగా స్వీకరించాయి. పులకించాయి."

పూబాలలు :

నిజమే... అది మాధర్మమే
మేము జనియించు దేశమేదయిన
మేము వెలయించు గంధమేదయిన
ప్రాణుల విందులకే అది మా చింతనయే !

వ్యాఖ్యాత :

"తోటమాలి పూబాలలను ప్రశంసించిన తరువాత, తనువచ్చిన పనిని తెలియచేస్తున్నాడు"

తోటమాలి:

దొరలు విందులు చేస్తున్నారు
దొరసానులు ఆనందిస్తున్నారు॥
గళాలు వారివి అలంకరించగ
హారములై మీరుండాలమ్మా
దయచేయండి! దయచేయండి! ॥
సన్మాన శిఖామణి శిరమున
వర్ష ధారలుగ కురియాలి
రారండీ! రారండీ! రండోరండి! ॥

వ్యాఖ్యాత :

"తోటమాలి వచ్చిన పనిని తెచ్చిన సందేశాన్ని విన్న పూబాలలు ఆశ్చర్యపడ్డాయి."

పూబాలలు :

దొరలా! దొరసానులా!!
విందులా! సన్మానాలా!!
ఎవరికీ? ఎవరెవరికీ?

వ్యాఖ్యాత :

"పూబాలలు తోటమాలిని అలా ప్రశ్నించగా, తోటమాలి వారికి గొప్పవారి గుణాలు చెప్పసాగాడు"

తోటమాలి :

వారలు మాన్యులు అసామాన్యులు
జనులు ఎంచిన ప్రజానాయకులు ||
యంత్రశాలలకు తంత్రశాలలకు
పాఠశాలలకు పానశాలలకు
ప్రభువులు వారూ! ఇక ప్రభువులు వారూ||

వ్యాఖ్యాత :

"పూబాలలు తోటమాలి చెప్పిన వారికన్న వున్న తమ అవమానాన్ని అసహనాన్ని తెలుపుతూ, మంచి వారికిమాత్రమే తము శుభాకాంక్షలంటారు"

పూబాలలు:

అలాగా...
రాము రాము రానేరాము
రాలేము రాలేము మేము ||
మంచిని పెంచే వారెవరైనా
మము కీర్తించే ఎవరైనా

ఆహ్వానిస్తే వస్తాము
శుభాకాంక్షలను తెస్తాము।
వర్ధిల్లాలని ఆశిస్తాము
సంఘ హృదయాల దీవిస్తాము
శతాయుష్మాన్ భవతి శతాయుః॥

వ్యాఖ్యాత :

"పూబాలలు ఇచ్చిన జవాబుకు తోటమాలి ఆశ్చర్య పడ్డాడు. ఆశ్చర్యాన్ని అణుచుకుంటూ వారిని ప్రేమగా అడుగుతున్నాడు."

తోటమాలి :

పూబాలలారా ఓ
పుష్పలాలికలారా।
ఎన్నడు వినలేదమ్మా నీ మాటలు
మన్నెన్నడు కనలేదమ్మా ఈ మాటలు॥

వ్యాఖ్యాత :

"పూబాలలు మాలి ఆశ్చర్యాన్ని అర్థంచేసుకుని వారి అభిప్రాయాలను తెలుపుతున్నాయి"

పూబాలలు :

మీలో.........
మంచిని పెంచేవారు కొందరే
మంచిని తుంచేవారు ఎందరో
అశాంతిని పెంచిరి ఎందరో
మము పోషించేవారెవరూ? ॥మం॥
ప్రజల నమ్మించి భ్రమలు కల్పించి

కపట నాయకులుగ అవతరించి
మత్తోన్మాదమున స్వార్థబుద్ధితో
మహాత్ములనె ఇల మంటగలిపిరి ||మం||
నాయకత్వమే వారసత్వమని
జన్మహక్కుగా వారు ఎంచిరి
సమసె బ్రతుకుల ప్రగతిని-
ఎవరూ ఇల ఆలోచించరు ||మం||
గారడి చేసేవారలతో
నేస్తం అసలే మాకొద్దు-మాకొద్దు
కలిమితో కులికే, కాంతా-
దాసుల దర్శనమే వద్దు—వద్దు ||మం||

వ్యాఖ్యాత :

"తోటమాలి పూబాలల నిశ్చయాన్ని తెలుసుకుని పూలదండలు గుచ్చి అమ్ముకొను లావికలనుచూపి, పూబాలలకు వారి గురించి, లోకధర్మాన్ని గురించి చెప్పే ప్రయత్నంచేస్తాడు"

తోటమాలి:

పూబాలలారా ఓ
పుష్పలాలినలారా ||పూ||
మీ కొరకు వచ్చారు
అరుగో లావికలు
త్యాగమేగా మీ జన్మం
లోకశోభయే మీ లక్ష్యం॥
మానవులానందించే వేళల

హారధారణకు
అభిషేకానికి
అర్పణ కానలె మీరు
అది తప్పుగా తలచరెవరూ ॥పూ॥

వ్యాఖ్యాత:
"పూబాలలకు లావికలు తమ రచనావిశేషణలగురించి చెబుతున్నారు."

లావికలు:
లావికలమూ మేము లావికలము
పుష్ప రచనా కళా కోవిదులము ॥లా॥
మన్మధుని మకుటము, అంబులు
కుబేరునకు రధము కూర్చినాము॥
గుచ్ఛాలు, హారాలు, శయ్యలూ రచయించి
మనసు ఉల్లాసిల్ల చేసినము మేము ॥
విరహ విరాగుల మీ పరాగము
భ్రమములకు విభ్రమములు కల్గించేము ॥

వ్యాఖ్యాత:
"పూ బాలలు తోటమాలి బోధలు విని కష్టూరా లాడుతున్నారు"

పూబాలలు:
వృధా త్యాగాలు ఎందుకు
ఇంలో అవి మాకెందుకు॥
స్వర్గంచేరే సోపానాలా
ముక్తి గ్రహించెడి మార్గాలా ॥

కండలు కరిగే బ్రతుకులు బ్రతికి
చిక్కి శల్యమా శ్రమ జీవులకు
ఆసవాలమా? ఔషధాలమా? ॥

వ్యాఖ్యాత :
"తోటమాలికి పూబాలల తిరస్కారం కోపం తెప్పించింది. బాలలపై గల ప్రేమచేత కోపాగ్ని ఉగ్రమింగాదు. "దొరలకు కోపంవస్తే జరిగే నష్టాలను" నొక్కి చెబుతున్నాడు"

తోటమాలి :
యుగ యుగాల ఆచారం తీరు
అడిగద మీ వారల ధర్మం సారు॥
మీరలు అలిగేరంటే ఇప్పుడు
అఘాయిత్యమది అవుతుందమ్మా॥
దొరలు సహించని ధిక్కారమ్మది
దొరల రోసమే శాసనమౌను॥
పట్టి బంధించి మిమ్ము తరలించి
తీర్చుకొందురు వారి కోర్కెలు॥
ఎందులకమ్మా అశాంతి చర్యలు
ఎందులకమ్మా అఘాయిత్యములు॥

వ్యాఖ్యాత:
"పూబాలలు తోటమాలి చేసిన హెచ్చరికను లెక్క చేయక తమ అభిప్రాయాలను విపులంగా చెప్పనారంభించాయి."

పూ బాలలు:

అశాంతిచర్యలు మావా?
అఘాయిత్యములు మావా?
పదవులు ఆశించి వారు
పాపములు తెగ చేసినారు
భోగముల తులతూగువారు
మా అభిమాన ధనముల దోచిరి ॥.

పరధనముల పొందు అధములు
మా పొందుకోరుట ధర్మమా?
నీతులు మార్చెడి వారలూ
మా సేవ కోరుట న్యాయమా? ॥

అడవులా అలరారినాము
హాయిగా జీవించినాము
కులమతా లెరుగమూ మేము
వనలక్ష్మి బిడ్డలము మేము॥
కోయిలమ్మతో చెలిమిచేసి
గోరువంకల పెంపుచూసి
చిలుకల పలుకులు వింటు
నేర్చినాము నెమలి ఆటలు ॥

మా బ్రతుకు మమ్ము ఇల బ్రతకనివ్వండి
మా ప్రేమ మా మరులు మాపేయకండి
కులపు కుచ్చితమ్ము మతపు మచ్చరమ్ము
మా శీతదేహాలు అంటనీకండి ॥

వ్యాఖ్యాత :

"తోటమాలి పూబాలల మనసు అర్థంచేసుకున్నాడు. అయినా తమదొరలు పూబాలల పోషణకు చేసిన ఏర్పాట్లను ప్రశంసిస్తూ వారి మంచితనాన్ని తెలియ చెబుతున్నాడు."

తోటమాలి:

పూబాలలారా ఓ పుష్పలాలినలారా
మీ మనసులో మీకు ఇంత బాధున్నదా? ।పూ।
మీ పోషణకు దొరలు ఎన్నో వసరులు కూర్చి
మీ పెంపునకు వారు పొదరిళ్ళనిచ్చి
ఆనందమున పెరిగి అలరారు చుండమని
కోరుచుండిరి తల్లి నిజమమ్మ విశదమ్మ।

వ్యాఖ్యాత:

"పూబాలలు తోటమాలి మాటలు నమ్మదలచలేదు. తమజాతి ప్రకృతిలో ఎంత స్వేచ్ఛగా జన్మించి జీవించు చుండేదో వూహించుకుంటూ తమను పట్నవాసాలకు చేర్చి ఎలా హింసిస్తున్నారో ఎలా అవమానిస్తున్నారో గట్టిగా చెప్పనారంభించారు।।

పూబాలలు:

కాదు కాదు కానేకాదు......
కొండల్లో కోనల్లో కారడవుల వుండే మేము
ప్రకృతి జడలోన మాతల్లి వొడిలోన
ఆడులాడే మమ్మ పట్టితెచ్చిన మీరు
కోరికలమేరకై పరిపోషించారు।।

ఆర్జించు స్వార్థులు మా ప్రాణమానాలు
హరణము లేచేశారు!
దేవునికిసహితమునుంచాలునేర్పారు
తుచ్ఛ స్వార్థముగాద?
మీ అందమును కోరి మా గొంతు కురివేసి
ఆనందడోలికల ఊగారుచుందురే?
ఇది మీకు న్యాయమా?
ఇది మీకు ధర్మమా?॥

వ్యాఖ్యాత:

"పూబాలలు కృతజ్ఞతయంతో చేసిన విన్నపాలకు ముగ్ధుడైకూడా ప్రభువులు దేశాభిమానులని, గొప్పపనులు చేశారని, చెప్పదలచాడు తోటమాలి"

తోటమాలి:

పూబాలలారా ఓ
పుష్పలాలినులారా॥
మీ కోరికేమిటో నాకు తెలుపండమ్మా
మీ బాధలేమిటో తెలుసుకోనిండమ్మా॥
దేశమేలే ప్రభువులు ఎన్నో గొప్పలుచేసి
దేశాభిమానులై పూజలందారిచట
వారు మిమ్ములు ఇపుడు కృతఘ్నులంటారా॥
మిమ్ము పెంచిన చేయి త్రుంచి కోసి మిమ్ము
తరలించదమ్మా! తాత మాటలు నమ్మరమ్మా॥

వ్యాఖ్యాత:

"పూబాలలు శాంత గంభీర వదనాలతో తమ మనో
భావాలు ప్రకటించుచున్నారు"

పూబాలలు:

మమ్ము పెంచిన మాలి తాతా
ఈ మాయలో మము ఈడ్వకయ్యా ॥మమ్ము॥

ఔషధాలకు రక్షింతుము
అంజనాలకు దేహమిత్తుము
మాంపలేని లోకాన మేము జన్మించాము
జన్మించినాముగా జీవించి తీరవలె ॥మమ్ము॥

దేశాభిమానము మాకు కలదని
వట్టిగొప్పలు మేము చెప్పము
త్యాగధనుల అమరవీరుల
మహాప్రస్థాన యాత్రల
వాహకుల పాదాల ధూళికి
మాగు మేనుల నందనిమ్మా
అదియే మాకొక స్వర్గపథము
పరమపద సోపాన పదము ॥మమ్ము॥

సమాప్తం

# మృచ్ఛకటికం

ఇది ప్రపంచఖ్యాతి పొందిన భారతీయ సంస్కృత నాటకాల్లో ఒకటి. ఈ నాటకం తొలుత భాసుని నాటకాల్లో అసంపూర్తి నాటకంగా మిగిలిపోయింది. దానిపేరు "చారుదత్త"—తదుపరి శూద్రక మహాకవిచే మృచ్ఛకటకంగా వెలుగు చూసింది. మృచ్ఛకటకం అంటే మట్టిబండి. ఈ మట్టిబండి నాటకం యొక్క పతాక సన్నివేశంలో ప్రధాన పాత్ర నిర్వహిస్తుంది. అందుచేత అది నాటకానికి మకుటమైంది.

వివిధ భాషలలో ఈ నాటకం వసంతసేన, చారుదత్త పేర్లతో అనువదించబడింది కూడా.

రచయిత సమకాలీన జీవితచిత్రణ చేయటంలో నాటకీయత చక్కగా వాడగింది. నాటకంలోని పాత్రలు సమకాలీన జీవితాన్ని చక్కగా ప్రదర్శిస్తాయి. కథానాయిక వసంతసేనలోని ఔచిత్యం, శకారునిలోని దుష్టత్వం; చారుదత్తుని సౌశీల్యత సాధారణ ప్రేక్షకునికి అందని విధంగా పెరిగిపోయాయి. అందుచేత ఈ నాటకం చూచినా చదివినా శకారుడూ, వసంతసేన ప్రేక్షక-పాఠక మనసుల్లో ముద్రపడతారు. మూడవ పాత్రగా చారుదత్తుడు కథారూపంలో నాయకుడుగా మూర్తికడతాడు. శర్విలకుడు, విటుడు, రాజోద్యోగి, సంవాహకుడు, మదనిక పాత్రలు నాటి సమాజాన్ని మన కన్నులకు కడతాయి. ఆలోచింప చేస్తాయి.

ఈ నాటకంలో వేశ్యాజాతి ఐశ్వర్యం, బానిసల క్రయం రాజరికపు దౌష్ట్యం, తిరుగుబాటుదారుల వ్యూహరచనలు, రాజోద్యోగుల అవినీతి, చోరవృత్తి, నిత్య జీవితంలో ఎడ్లబండ్లు పరిచయం అవుతాయి. ఆ నాటికి గుర్రాలు రాజరికపు సైన్యాలకు పరిమితంగా భావించవచ్చు. ఈ కథా వస్తువునిబట్టి ఎడ్లబండ్ల వాడుకనుబట్టి కుశావంతి నగరం భారత తూర్పు సముద్రతీర ప్రాంతంగా గుర్తించడం తప్పకాబోదు. పాత్రల పేర్లుకూడా అందుకు దోహదం చేస్తాయి. జైనమత ప్రభావం పశ్చిమ భారత శిల్పాల్లోనూ, బౌద్ధమతచ్ఛాయలు తూర్పుతీర భారతంలోను, నేటికీ నిలిచి వుండటం గమనార్హం.

సంవాహకుడు నిరుద్యోగం దారిద్ర్యం అనుభవించలేక బౌద్ధ భిక్షువుగా జీవితం సాగించేవానిగా చిత్రించడం, మైత్రేయుడనే ఒక ఋషి. (మైత్రావరుణుడు) పాత్రను విదూషకునిగా చేయడం. చారుదత్తుని పాత్రలో ఉత్తమ గుణాలు చిత్రించి ఆ పాత్రను ప్రేక్షకుల మనసులో ప్రతిష్టించలేకపోవడం రచయిత ఆలోచనలు అతని సమకాలీన జీవితాశయాలను చిత్రించడంలో విమర్శనాత్మక దృష్టిని ప్రశంసాత్మక దృష్టిని ఏయే పాత్రలకు ఎలా ఆపాదించాడనేది పరిశీలనాంశం. (స్థలా భావంచేత పాఠకులకు ఒక క్రొత్త ఆలోచన కల్పించే వరకే ఇక్కడ ఈ చిన్న ప్రయత్నం).

కథ : వసంతసేనను వసంతోత్సవ నృత్య వేడుకల్లో చూచాడు శకారుడు. మోహించాడు, వెంబడించాడు. ఆమె అతనికి అందకుండా పారిపోయింది. తెలియక చేరి

ఇల్లు చారుదత్తునిదని తెలుసుకొంది. వసంతసేన చారుదత్తుని ఇంట నగలు వుంచి ఇంటికి వెళ్ళింది.

వసంతసేనకు చారుదత్తుని పరిచయం లభించటంతో ఆనందంగా చెలికత్తెతో చెప్పుకుంటున్నది. ఇంతలో సంవాహకుడు జూదంలో పది సువర్ణాలు బాకీపడి పారిపోయి వచ్చి వసంతసేన ఇంట్లో దూరాడు. తను చారుదత్తుని సేవకుణ్ణని చెప్పుకున్నాడు. చారుదత్తుని సేవకునికి, సేవలకు పూనుకుంది వసంతసేన. తాను సేవలకు అనర్హుడనని చెప్పుకుని తన బాధను వెళ్ళబోసుకున్నాడు. వసంతసేన పది సువర్ణాలు అతనికిచ్చి సగౌరవంగా సాగనంపింది.

ఆనగలను దాచి, తరువాత వసంతసేనకు చేర్చి మిత్రునిని అవి మైత్రేయుని వద్ద వుంచబడ్డాయి. మైత్రేయుడు భోజనప్రియుడు, నిద్రాప్రియుడు, ఆరాత్రి తలక్రింద వున్న నగల మూట వత్తిడికి నిద్ర పట్టటంలేదు శర్విలకుడు అనే దొంగ చారుదత్తుని ఇంటికి కన్నంవేసి, లోనికి ప్రవేశించాడు. అడుగుల సవ్వడి విన్న మైత్రేయుడు చారుదత్తుని భావించి ఆ నగలు మూట కళ్ళుమూసుకుని అందించాడు. దొంగ ఆనందించాడు. ఉదయమే చారుదత్తుడు లేచి దొంగ వచ్చాడని తెలుసుకున్నాడు. నగలు పోయిన తీరు తెలుసుకున్నాడు. వసంతసేన ఋణం తీర్చటం గురించి బాధపడ్డాడు.

వసంతసేన ఇంటిపెరటిలోని ఏనుగు కట్లు తెంచుకుని వీధిన పడింది. జనంగగ్గోలు పెడుతున్నారు. మావటి సుందరలించబోతే తొండముతో విసిరేసింది సంవాహకుణ్ణి

దంతాలతో ఎత్తింది. పూర్ణకుడనే వసంతసేన నౌకరు ఆనుప కోసం అంకుశాన్ని తీసుకు వెళ్ళి దాన్ని లొంగదీశాడు. అతన్ని జనం అంతా అభినందిస్తున్నారు. దారిన పోతున్న చారుదత్తుడు హారమేదైనా ఇవ్వాలని ప్రయత్నించి విచారించి తనపై ఉత్తరీయాన్ని బహూకరించాడు. దానిని స్పృశించిన వసంతసేన పరవశించి పోతుంది. పూర్ణకుడి ప్రతాపాన్ని కొనియాడుతుంది.

నగలు తీసుకున్న శర్విలకుడు మదనిక కోసం వసంతసేన ఇంటికి వెళ్ళాడు. నగలు చూసి మదనిక ఎవరినో చంపి తెచ్చావని నిందిస్తుంది. కాదు కన్నం వేసి తెచ్చానంటాడు. నగలు చూసి ఆశ్చర్యపోతుంది. నగలు మా వసంతసేనవి, అవి చారుదత్తుడి ఇంట్లో ఉంచింది ఆ ఇంటికి కన్నం వేశావా? ఎంత పని చేశావు అని బాధపడింది. ప్రియుడికి ఒక ఉపాయం చెప్పింది చారుదత్తుని వారు ఈ నగలు పంపించారు అని చెప్పమంటుంది. అలా చెప్పాడు అతను

విషయం అంతా తెలిసిన వసంతసేన నవ్వుకొంది. వారి ప్రేమను ప్రశంసించింది. దాసిగా ఉన్న మదనికను శర్విలకునికి ఇచ్చివేసింది. ఆనందించారు ప్రశంసించారు, వెళ్ళిపోయారు.

మైత్రేయుడు చారుదత్తుని భార్య రత్నావళిని తీసుకొచ్చాడు. వసంతసేన ఐశ్వర్యాన్ని ఆవాసాన్ని చూచి ఆశ్చర్యపోయాడు. తనమిత్రుడు జూదంలో నీ నగలు ఓడిపోయాడు. దానికి బదులు ఈ నగ పంపాడు స్వీకరించి సరిపెట్టుకోమని చెప్పమన్నాడని చెప్పాడు. విని నవ్వుకుంది.

వారి నిజాయితీని మెచ్చుకుంది. నన్నే పంపించినదాన్ని ఎందుకాదనాలి, ఒకసారి చూడవస్తానని చమత్కరించింది వసంత సేన. ఆమె చమత్కారానికి [illegible] మైత్రేయుడు తిట్టుకుంటూ గడపదాటాడు. మైత్రేయుని చూచి వసంత సేన ఆనందంగా నవ్వుకుంది.

వసంతసేన సర్వాంగ సుందరంగా అలంకరించుకొని చారు దత్తుని ఇంటికి వచ్చింది. చారుదత్తుడు పూదోటలోకి విహారానికి వెళ్ళాడు. చారుదత్తుని కొడుకు రోహసేనుడు బంగారు బండి కావాలని మారాం చేస్తున్నాడు. పరిచారిక రదనిక అతన్ని ఓదారుస్తున్నది. అతను వినటంలేదు. వసంతసేనకు జాలి వేసింది ఆ నగలు మట్టి బంకిలో కొన్ని వేసి బంగారు బండి చేయించమని రదనికకు చెప్పింది. రోహసేనుని ఆనంద పరిచింది. బయట వున్న చారుదత్తుని బండిని వుంచమని ఆమె అలంకరణకు వెళ్ళింది. ఇంతలో ఆ బండి ముందుకు వెళ్ళి వేరొక బండి వచ్చి ఆగింది. వసంతసేన ఆబండి ఎక్కి వెళ్ళింది. అది శకారుడు తోటకు చేరటం— శకారుడు కనబడటం తారసపడింది. ఆమె ఆశ్చర్యపడి జరిగిన పొరపాటుకు వగచింది.

శకారుడు బలవంతం చేశాడు. ఆమె లొంగలేదు. ఆమెను గొంతునులిమాడు. ఆమె చనిపోయిందని విటుడు చెప్పాడు. అక్కడకు ఒక భిక్షువు వొస్తున్నాడని గమనించి ఆమెను ఎండుటాకులలో కప్పివేసి పారిపోయాడు. సంవాహకుడు భిక్షువుగా జీవిస్తూ అచటకు కొచ్చి తడిబట్ట ఎండుటాకులపై ఆరవేశాడు. ఆకులు కదులుతున్నాయి. భయం వేసింది. ఆకుల పోగులోంచి ఆమనిషి లేచింది. ఆమె

వసంతసేనగా గుర్తించాడు. తన పరిచయం వివరించాడు. ఆమె ఇంటికి వెళ్ళడానికి సహాయంగా నడిచాడు.

శకారుడు పోయిపోయి ధైర్యం చిక్కబట్టుకుని ఒక పన్నాగం పన్నాడు. రక్షకభటులు చారుదత్తుని ఇంటికి వెళితే అతను లేడు. మట్టిబండిలో బంగారు నగలున్నాయి. అవి వసంతసేనవి. చారుదత్తుడు వసంతసేనను హత్యచేసి నగలు అపహరించినట్లు నేరం మోపాడు. న్యాయాధికారులు శకారుని ఆరోపణ ఆమోదించారు. చారుదత్తుడు నిర్దోషిగా నిరూపించుకోలేక పోయాడన్నారు. మరణశిక్ష విధించారు.

నగరంఅంతా గగ్గోలుగా వుంది.

విప్లవకారులు చెరసాలనుండి ఆర్యకుణ్ణి విడిపించారు.

మరణశిక్ష పడిన చారుదత్తుడు వూరేగించబడు తున్నాడు.

విప్లవకారులు ప్రజలు శకారుణ్ణి వెంబడించారు.

ఆర్యకుడు తన రాజ్యాధికారం ప్రకటించాడు.

చారుదత్తుని మరణ శిక్ష రద్దయింది.

శకారుడు నేరస్థుడిగా బంధించబడ్డాడు

చారుదత్తుడు, వసంతసేన, రోహసేనుడు, చారుదత్తుని భార్య పరివారం ఆనందాబ్ధిలో తేలియాడారు.

## పాత్రల పరిచయం

**చారుదత్తుడు :**

వ్యాపారి, కళాభిమాని. సంగీత, నాట్య, సాహిత్యాలు తెలిసినవాడు. శ్రోత్రియుడు, దానధర్మాలు చేసిన కార

ణంగా, సముద్రంలో ఓడలు మునిగిపోయి వ్యాపారంలో నష్టపోయాడు. ఎవరైనా దేహీ అన్నపుడు ఆదరించలేక పోయానని బాధపడుతుంటాడు. అతను వసంతసేన నగలు తన ఇంట దొంగదోచుకుపోగా అదితెలియక దొంగ కన్నం వేయుటంలోని నైపుణ్యాన్ని కళాత్మకంగా ప్రశంసిస్తాడు. అతని ప్రశయుకు తంఇంట ఏమీ దొరకనందుకు దొంగ ఎంత బాధపడి వుంటాడోనని బాధపడతాడు.

వసంతసేన నగలు తన ఇంటిలో దొంగలుపడి దొంగి లించారని చెప్పలేక అబద్ధం ఆడ నిశ్చయించి అవి జూదంలో పోయాయని అందుకు బదులుగా తన భార్య రత్నావళి పంపినట్లు క్షమాపణలు కోరుతున్నానని మైత్రేయునితో వర్తమానం పంపుతాడు.

తనను ప్రేమించిన వసంతసేనను గౌరవిస్తాడు. వసంత సేనను మోహించిన శకారుడు చారుదత్తుపై కక్షకట్టినట్లు ప్రవర్తించాడు. అతనిపై వసంతసేన హత్యానేరం మోపాడు. న్యాయస్థానంలో చారుదత్తునికి న్యాయం జరగలేదు. అతను మరణశిక్షపడి వధస్థానానికి వూరేగింపుగా వెళుతున్నాడు భార్యాబిడ్డల్ని దరిచేరనీయలేదు. దేశంలో ఆర్యకుని నాయ కత్వాన విప్లవకారులు విజృంభించి జైలులోని ఆర్యకుడు విడుదలైన రాజకీయం ప్రకటించాడు. వసంతసేన బ్రతికి వుండటంచేత చారుదత్తునికి శిక్షరద్దయింది.

ఈ పాత్రలో దయ, శాంతం, దుఃఖం, కరుణ ఆనందం ప్రదర్శించడానికి మంచి అవకాశాలున్నాయి.

శకారుడు:

'ఇతడు రాజప్రతినిధి- భోగలాలసుడు, సాహిత్య సౌగంధం అంటని వాడు. స్త్రీవ్యామోహం జాస్తి. వసంతోత్సవంలో వసంతసేనను చూచి వెంబడించాడు. విటులను పంపాడు. పనిజరగలేదు. ఎలాగయినా సరే వసంత సేనను అనుభవించాలనే కోరికచావలేదు ఒకరోజు పొర పాటున వసంతసేన చారుదత్తుని బండిగా భావించి శకారుని బండిలో ఎక్కింది. ఆ బండి పుష్పకరండక తోటలోకి వెళ్ళి శకారుని వద్ద ఆగింది. శకారుడి ఆనందానికి అవధుల్లేవు. వసంతసేనను పొగిడాడు. ప్రార్థించాడు. ఆమె అంగీకరించ లేదు అతని పొందు. శకారుడు ఆగ్రహించాడు. చంపుతానని బెదిరించాడు కాని ఆమె లొంగలేదు. గొంతు పిసికి చంపా లనుకున్నాడు. ఆమె గొంతు నులిమాడు. అంతలో అటు వేపు ఓ బిక్షువు వస్తూ వుండటం చూచి విటుడి సలహాపై ఆమె మరణించిందని భయపడి పారిపోయాడు.

భటులు చెప్పిన సమాచారం మేరకు చారుదత్తుని ఇంటిలో మట్టిబండిలో బంగారు నగలు చూచి దుష్టవ్యూహం పన్ని చారుదత్తునిపై వసంతసేన హత్యానేరం మోపి మరణశిక్ష వేయించాడు.

దేశంలోని అంతర్యుద్ధంలో భాగంగా ఆర్యకుడు చర విడిపించుకొని బయటకొచ్చి రాజ్యాధికారం ప్రకటించాడు.

శకారుడు ప్రజలచేత హింసింపబడి ఆర్యకునిచే రాజదండనకు గురయ్యాడు. ఇతను భాషరాని మూర్ఖుడు.

ఇతని పాత్రలో గాంభీర్యం-వాచకంలో హాస్యం వుంటాయి. ఇతను ప్రజల దృష్టిలో గౌరవం పొందలేక పోయాడు.

వసంతసేన :

ఈమె వేశ్య. బంగారానికి తావిఅబ్బినట్లు సాహిత్యం సంగీతం, నాట్యం ఈమెకు బాగా పరిచయం. గొప్ప నాట్యగత్తెగా రాజ్యంలో పేరుమోసింది. కోరికలు పద్మినీజాతి స్త్రీవి- భక్తి, ఉత్తమపురుష ప్రేమారాధనా, కుటిలప్రవృత్తి నిరాకరణ, ఈమె గుణాలు. వయసుకు తగిన మంచి శరీర సౌష్టవం.

శకారుడు వెంబడించడంవల్ల పుష్పకరండకంలోనుంచి తప్పుకుంది. చెలులూ ఆమెవేరయ్యారు. చారుదత్తుని ఇంటికి చేరింది తెలియక. తెలిసి ఆనందించింది. నగలు దాచమని అతనికిచ్చింది. అవి దొంగిలించిన దొంగ ఆ నగలతో తన దాసిని విడిపించుకోడానికి వచ్చాడు. ఆనగలగురించి తెలుసుకుంది. దాసికోరిక మన్నించి ఆమెకు విముక్తి నిచ్చింది.

ఒకనాటి చారుదత్తుని సేవకుడు జూదంలో ఓడిపోయి గెలుపుదార్ల బాధ తట్టుకోలేక పారిపోయి వసంతసేన కిళ్ళ వద్దాడు. ఆతడు చారుదత్తుని సేవకుడని తెలిసి ఆనందించిన అతనికి బంగారం నాణాలు ఇచ్చింది. అతను భిక్షువుల్లో చేరిపోతానని వెళ్ళిపోయాడు.

మీ నగలు జూదంలో పోయాయి. అందుకని నామిత్రుడు తన భార్య నగలు పంపాడు అని మైత్రేయుడు వసంతసేన ఇంటికి వచ్చాడు. నేను మీమిత్రుని ఇంటికివచ్చి

చూస్తాను. అన్నది. వసంతసేన తన నగలన్నీ తీసుకొని చారుదత్తుని ఇంటికెళ్ళింది. అచ్చట రోహసేనుడు మట్టి బండితో ఆడుకోనని మారాంచేస్తున్నాడు. ఆనగలు మట్టి బండిలో వేసి బంగారుబండి చేయించుకోమంటుంది. చారు దత్తుకోసం తోటకు బయలుదేరింది.

పొరపాటున శకారుని బండి ఎక్కి అతని వలలో చిక్కి అతనిచేత హత్యచేయబడింది. కాని ప్రాణంపోలేదు. కొంత సేపటికి తెలివివచ్చి భిక్షు సంవాహకుని సేవలందుకుంది. చారుదత్తునికి మరణశిక్ష విధించబడినట్లు తెలిసి తల్లడిల్లింది. ఆర్యకుడు అధికారానికొచ్చి మరణశిక్ష రద్దుచేయగా చారు దత్తుని చేరి ఆనందించింది.

ఈపాత్రలో శృంగారం ప్రధానమైంది. ఆనందం, ఆట, పాట, అలంకరణ, దానం, ప్రేమోపాసన ప్రధాన స్వభా వాలు. పతాక సన్నివేశంలో దుఃఖం, భయం, పాత్రలోని ఔచిత్యాన్ని కరుణరసపూరితం చేస్తాయి.

మదనిక_రదనిక :

మదనిక పాత్ర నాటి బానిస స్త్రీజాతి ప్రతినిధి. శర్విలకుని ప్రియురాలు మదనిక. ఆమెను అతను స్వీకరించక ముందే వసంతసేనకు బానిసగా అమ్మివేయబడింది. ఆమెను విడిపించుకోవడానికి శర్విలకుడు చారుదత్తుని ఇంట్లో దొంగ తనం చేశాడని తెలిసి చాలా బాధపడుతుంది. ఆనగలు వసంతసేనవని తెలిసి కంగారుపడుతుంది. విషయం తెలిసిన వసంతసేన దయాపూర్ణ హృదయంతో తనకు విముక్తి ప్రసా

దించగా కృతజ్ఞతాభావంతో ఆమె పాదాలపై వాలుతుంది. శర్విలకునితో ఆనందంగా జీవించనారంభిస్తుంది.

రదనిక సహజమైన సేవాభావం గల దాసిని.

మైత్రేయుడు :

భోజనప్రియుడైన బ్రాహ్మణుడు. కథానాయకుని ప్రక్కన విదూషకుడు. వేద కాలంలో పవిత్రమైన మైత్రేయుడు ఈ నాటక రచనలో విదూషకుడైనాడు. కారణం వైదిక, బౌద్ధ, జైన మత ఘర్షణలలో నైతిక ధర్మం నెపుక పట్టుపట్టినట్లు భావించవచ్చు. ఇతనికి బుద్ధిబలం లేనట్లు జబ్బబలమే వున్నట్లు కనిపించాడు. వేషం వాచకం హాస్య ప్రధానం.

శర్విలకుడు :

పతనమైన బ్రాహ్మణ వర్గ ప్రతినిధి—చోరకళ వృత్తిగా స్వీకరించి అందులో నైపుణ్యాం సంపాదించాడు. జంధ్యాన్ని కొలతతాడుగా ఉపయోగిస్తుంటాడు. సహవాస సంపర్క ఫలితంగా వేశ్యకొన్న దాసిని స్త్రీని తనుకొను టకే ప్రయత్నం చేస్తాడు. దేశంలో తిరుగుబాటు ప్రకటించిన ఆర్యకునికి సహకరిస్తాడు.

విటుడు :

రాజప్రాసాదపు దాసిన. శకారుడు దుష్టుడని తెలిసిన వాడు. ఆర్యకునికి విప్లవకారులకు సహకరిస్తాడు. శకారుని విపరీత ధోరణిని ప్రక్కదోవ పట్టిస్తాడు.

ఆర్యకుడు :

విప్లవ నాయకుడు, పాలకరాజు కుశావతీ దేశాన్ని జయించి శకారుని రాజప్రతినిధిగా వుంచడాన్ని వ్యతిరేకించి పోరాటం ప్రకటిస్తాడు. చెరసాలలో వుంచబడతాడు. చెరసాలను ఛేదించుకుని బయటపడి విజయం పొంది రాజశాసనం ప్రకటించాడు.

రోహసేనుడు :

పసివాడు, చారుదత్తుని కొడుకు. ఒకనాటి తన ఐశ్వర్యానికి నేటి దైన్యానికి ప్రతినిధిగా వుంటాడు. తల్లిపట్ల గౌరవం, సవతి తల్లిగా వసంతసేన పట్ల అనుబంధం తెలియనివాడు. తండ్రికి మరణ శిక్షపడగా తండ్రి కోసం విలపిస్తాడు. తండ్రి నిర్దోషిగా విడుదలకాగా తండ్రిని చేరి ఆనందిస్తాడు.

సంవాహకుడు/భిక్షువు

నాటి పతన సమాజ ప్రతినిధులు. బానిసల్లోకూడా జూదంపట్ల వ్యసనాన్ని ప్రదర్శించి ఆటగాళ్ళ చేత హింసించబడి పారిపోతాడు. వసంతసేన దయవల్ల అబద్ధం చెప్పి భిక్షువుల్లో కలిసిపోతాడు. నేటి సాధువుల వలె ఆనాటి భిక్షుకవృత్తి సంసార లంపటంలేని గౌరవయాచక వృత్తిలో చేరుతాడు. వసంతసేన దైన్యం చూచి కరుణ రసార్ద్రిత పొంది సేవాధర్మం ప్రదర్శిస్తాడు.

రాజోద్యోగి :

పతన సమాజపు అవినీతికి ప్రతినిధి. నేటి లంచగొండి అధికారులకు పోలిక. శకారుడు చెప్పిన మాటకు ధర్మపన్నాలు వల్లించి శిక్షఖాయ పరచుతాడు.

మహాకవి శూద్రకుడు :

శూద్రకుడనేది కవిగుప్త నామమని పరిశోధకులు పేర్కొంటున్నారు. ఇతడు మంత్రిసత్తముడని కొందరు, మహారాజని కొందరు అంటున్నారు. ఇతను కాళిదాసు కంటే ముందు జీవించిన వాడని కొందరి అభిప్రాయం. కాని భాస నాటకాలు క్రీ.శ. 3వ శతాబ్దిలోనివని తేల్చారు. కాని శూద్రకుని మృచ్ఛకటికం క్రీ. పూ. 100 నాటి రచనని కొందరి అభిప్రాయం. ధావ భాసుడనే కవి పేరొకటి తెలియడంచేత ఇది అతని రచన అని కొందరి వాదన. ధావకుడనే కవి హర్షవర్ధనుని ఆస్థానంలో వున్నట్లు కొన్ని ఆధారాలు. అతను 600 తరువాతివాడు.

ఆధునిక విమర్శకుల్లో అగ్రగణ్యులు క్రీ. శ. 6_7 శతాబ్దాల మధ్యకాలంగా నిర్ణయించారు_

శూద్రకుని పుట్టుపూర్వోత్తరాలు సరిగా లభ్యం కావడంలేదు. కాని మృచ్ఛకటికంసంస్కృత మహానాటకాల్లో ఒకటిగా అందరూ అంగీకరించారు.

# వసంత సేన

మాతృక : "మృచ్ఛకటికం" సంస్కృతనాటకం

1వ సీను—దేవాలయం:

(వసంతోత్సవ వేడుకలలో దేవదాసి వసంత సేన వసంత మంటపంలో వినోదభరితంగా నృత్యం చేస్తున్నది. సభికులు ఆనందిస్తున్నారు. వసంతసేన చారుదత్తుని అభిమాన్ని పొందే ప్రయత్నం—గౌరవ, భక్తి, ప్రపత్తుతో నాట్యం చేస్తున్నది. చారుదత్తుడు రసానందంలో మునిగి వున్నాడు. శకారుడు శృంగార వికారాలు అనుభవిస్తున్నాడు. వసంత సేనను అందుకోవాలని తహతహలాడుతున్నాడు)

వసంతసేన :(నృత్యం చేస్తున్నది)

మనసాయరా! మనసాయరా!
సరస సౌశీల్య సుందర హృదయుడా ॥మన॥

నినుజూడ నాయద పరవసించేను
పరవసించిన యదను కలలు పూపేను
కలలూరిన యద పొదలా పూచేను
పూచిన పొద కదలి ఝల్లుఝల్లని రాలి
ఈ హృదయ కుసుమాలు నీపాదాల రాలె ॥మన॥

మన్మథుడే! నవ మన్మథుడే! రసమన్మథుడే!
ఆవహించేను! యద దహియించేను
సుందర సాగరా సుడివై రారా
తాప ముపశమింప కౌగలించరా
చరిత శిలివని నిన్ను కోరుకున్నారా ॥మన॥

సిగులు గిరులై నాకు ఎన్నో వున్నాయి
శ్రీ సుందర వయలు నేచూడ లేదు
కీర్తి శిఖరాలెక్కి కొలనై యున్నావు
కోంక తీరక నీ లోయలు నన్నాను
పిలుపులు వినరా! నా హృదయాధి దేవా ॥పున॥

శకారుడు : ఓహో! వసంతసేనా! ఇవిగో నాకానుకలు అందుకో!

వసంతసేన : (జవాబు లేదు)

శకారుడు :

ఓహో! అహో! ఏమి నీఅందం
మేనకా ఊర్వశి ఎందుకు నీముందు ॥ఓహో॥
సీతలా సావిత్రిలా ఇంద్రలోకంలో
నా హృదయాలయంలో నిలువరావె ॥ఓహో॥
అబ్బ నిసొగసు జూచి బుద్ధి మొద్దుబారె
ఆహా నీనాట్యమే నామనసును చంపెనే ॥ఓహో॥
ఈ రాజు నీ దేశాధిపతినే! వీరుడనే
పిలుపు వినావే! నాకోరిక దీర్చవే ॥ఓహో॥

వసంతసేన : (శకారుని నిర్లక్ష్యం చేసింది. చారుదత్తునికి ప్రణామం చేసింది)
"ఆశీర్వదించండి శుభాశయా! అనుగ్రహించండి!"

చారుదత్తుడు :

అసుర ఖ్యాదద వీవు సౌశీల్యరాసి
పదయుగళ హేలా పరమేశ్వరీ ॥అసు॥

(వసంతసేన నాట్యం ప్రారంభించింది)
చరణకింకిణి ఝుణుతి లీలా
వర్ధిల్లు శతవర్ష వాసంతి వేలా ॥అప॥

రాగరంజితమైన భావవిన్యాసాలు
భగవతినీలీల ప్రభవించు బాల ॥అప॥

భరతుని బ్రహ్మను ఉపవసించిననీవు
గౌరీ నటరాజులను అర్చించి తరియించు ॥అప॥

"వసంతసేనా ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లు!"

శకారుడు : (అసహ్యించుకుంటాడు. అసహనం ప్రదర్శిస్తాడు)

2వ సీను : అడవి—

(శకారుడు రాజ ప్రతినిధిగా దేశంలో అరాజకం సృష్టించాడు. అరాజకం ప్రబలింది. అడవిప్రదేశంలో ఆర్యకుడు, శర్విలకుడు; చందనుడు, విటుడు వున్నారు)

ఆర్యకుడు :

మిత్రులారా! నా మిత్రులారా!
చందన శర్విలకులారా! ప్రజలారా! ॥మిత్రు॥

శకారుని వికారాలను–ప్రజలంతా చవిచూచారు
రాచనారి ప్రక్రమాలనూ–అనుభవించి చూచారు
ఆర్యకుడు తిరుగుబాటు–బావుటాను ఎత్తాడు
సుఖమయ జీవితాలు–సుందర స్వప్నాలు
గురువుల పూజించే–శ్రేష్ఠుల గౌరవించే
ఆచారశాస్త్రాలి–అందరు సుఖియించాలి ॥మిత్రు॥

శర్విలకుడు :

ధర్మము అధర్మము నా కంటితో చూచాను
దౌర్భాగ్యం దౌర్జన్యం నేననుభవించాను
ఓడలు బండ్లపైకి బండ్లు ఓడలపైకి
తారుమారు అవుతాయి తప్పదు ఈ తరుణంలో ||ధ||
బంగరు బంతితో ఆడినట్టివాడు
మంటి బండితో కూడా ఆడక తప్పదు ||ధ||

చందనుడు :

శర్విలకా ఈ పాలకరాజొచ్చి
శకారునికి రాజ్యమిచ్చె చూడు ||శ||
ఇప్పుడతను దేవతలను ధర్మదేవతలను
కుంటిగడ్డి చేశాడు మూలకు తోసేశాడు
చారుదత్తిప్పుడు పేదరికం చవిచూడను
నాడంతా దేహీ యనగానే ఆర్తిని దీర్చెను ||శ||
చెరువులు సత్రాలు బడులు గుడులు కట్టించి
ఆనందం అందరితో ఆనాడు పంచుకొనెను
దానధర్మాలీయలేక బాధలతో క్రుంగి
శిథిలాలయ శిల్పమై నిలిచాడు నేడు ||శ||

విటుడు :

అన్నలారా ఆర్యులార నేను దొంగవిటుడను
శకారునికి చెలికాడిగ కార్యం సాధిస్తాను ||అన్న||
వసంతసేనను వాడు వెంటాడుతున్నాడు
చారుదత్తు సౌశీల్యం నిందలపాల్జేశాడు ||అన్న||

అందరూ:

నికృష్టపు రాజరికం నేలకూలువరకు
నిజమైన ధర్మధ్వజం రెపరెపలాడేవరకు ॥1॥
కుశావతి దేశమాత బానిస సంకెళ్ళు త్రెంచ
తిరుగుబాటు తప్పదు-పోరాటం జ్వాలై ॥2॥
కదలింది-చైతన్యం-కదలిందీ
చైతన్యరథం-చైతన్యరథం ॥

3 వ సీను: చారుదత్తుని వీధి

(వసంతసేన పరుగున వచ్చి ఒక ఇంటివారన దాగింది.
ఆమెను తరుముతూ శకారుడు వచ్చాడు)

శకారుడు :

ఆడదానా ఆడేదానా
అందమైన దంతపు వీణా ॥ఆడ॥
మోగవే మోగించవే
నా మదిని నీవు రగిలించవే ॥ఆడ

నిలువు నిలువుమా వసంతసేనా
మెరుపు టద్దమా జిగుగుల జాంగా
పరమానవుణ్ణి నిను తరుముచుంటినే
కామించానే మోహించానే వెంబడించానే ॥ఆడ॥

నీ నగల గలగల కనులనింటినే
నీ పువ్వుల వాసన చెవులకంటినే
నీ పువ్వుల చప్పుడు నగల వాసనలు
ఈ పున్నమి చీకటి ఇక నాదేనే ॥ఆడ॥

కాముని పున్నమి వేడుకనాడు
నా కంటబడితివే కాసుల సేనా
వంటికి సుఖమే వసంతసేనా
కంటికి సుఖమే కవ్వం వీణా ||ఆడ||
చరిత్రనంతా చదవగలదానే
పురాణాలను పులుసు చేతునే
న్యాయం ధర్మం కలిపేస్తానే
నానాగొడవా చేసేస్తాని నాకు దక్కకుంటే ||ఆడ||
రాజుగారి చినముద్దుల రాణికి
సొయానా నే చినతమ్ముడనే
నేనేమనుకున్నా చేసెయగలనే
కోపంవస్తే చంపేస్తానే ||ఆడ||
(వసంతసేనను వెతుకుతూ అవతలకు పోయాడు)

వసంతసేన :

అయ్యో అయ్యో ధూర్తుడు
అడ్డగించె రాజమార్గమును
ఈ రాత్రివేళలో నిర్జనపు వీధిలో
ఏవిటి దిక్కు ఎటుబోదు నేను ||అ||
అదిగో అదిగో వరాను మదిగో
ఇదిగో ఇదిగో దరిచేరినాను
ఇందు మెల్లగదూరి ఈ దాడి దాటుకుని
హాయిగా యింటికి నే చేరుకుంటాను ||అ||
(శకారుడు విటుడూ వచ్చారు. వసంతసేన చారుదత్తుని ఇంట్లోకి వెళ్ళింది)

విటుడు :

శకారా! శకారా! ఓ రోరివికారా
శనిగ్రహావు రూపానికి ప్రతిరూప మీవురా ॥శ॥

ఆ ఇంట ఈ ఇంట దూరగాను తగదురా
ప్రతి ఆడదాని వెంట నీవు పరుగులిడ తగదురా ॥శ॥

అందమైన చిన్నదాన్ని అడిగినచో రానిదాన్ని
ఆ కోరిక లేనిదాన్ని బలవంతం చేయుకురా ॥శ॥

(శకారుడు—అతని వెంట విటుడు వెళ్ళారు)

వసంతసేన :

ఆపదలో దొరికిన ఈ చోటు
ఏ దయామయుని ఆవాసమో ॥ఆ॥

అన్యాయముగను వెంటాడగ
ఆగంతకుడే కాచెను నన్ను
మాన్యుని గృహమున నేను
తలదాచుకొనగ చేరినాను. ॥ఆ॥

నగలు నాగాభరణము లు
ధరించియుండ తగను నేను
వొలిచి ఇద్చి నే పోదును
నిశ్చింతగ నా నివాసమ్ము వరకు ఆ॥

(వసంతసేన చారుదత్తు ఇంటిలో! వెళ్ళింది. మైత్రే యుడు కర్రతో బయటకొచ్చాడు. శకారుడు, విటుడు వచ్చారు)

మైత్రేయుడు :

ఎవరివయ్యా నీవు ఈ చీకటిలో వచ్చావు
ఎవరికోసమొచ్చావు ఎచటనుండి వచ్చావు ॥ఎవ॥
ఇది చారుదత్తుని ఇల్లు చరితార్థు చూడచెల్లు
తగని పనులు చేయుసిగ్గువద వినుము రోయ
(మైత్రేయుడిని లెక్కచెయ్యకుండా వారు వెతుకుతున్నారు)
ఈ కర్రగట్టిచూపు తగిలిందో ఎముకలూడు
(శకారుడు విటుడు పరుగుతీశారు)
పరుగేల కందలారా పనిలేద వేర మీకు ॥ఎవ॥

4 వ సీను - వసంతసేన ఇల్లు :
(సంవాహకుడు ప్రవేశించాడు. వసంతసేన మదనిక ప్రవేశించారు)

సంవాహకుడు :

జూదమూడి వాదమాడి జీవితాన వోడినాను
అప్పులవాళ్ళంత నన్ను వెంబడిస్తు చున్నారు॥జూ॥
చారుదత్తునింట సేవకునిగ వున్నప్పుడు
తిండికి బట్టకు ఎప్పుడు కొదువలేదు నాకు
ఆ సుగుణమూర్తి గ్రహణములో చిక్కినాడు
ఈ సంవాహకుడే శవవాహకుడై సుక్కినాడు ॥జూ॥
(వసంతసేన సపర్యలు మర్యాదలు చేయుచున్నది)
అమ్మా వసంతసేనా సేవకు తగనమ్మా
పది సువర్ణాలకే పారిపోయాను తల్లి
(వసంతసేన పది సువర్ణాలిచ్చింది)

చుట్టిలా బంగారుమీరు ఇచ్చారు! వందనాలుతల్లి!
చాలు ఈ జీవితము సన్యసింతు నేను- ||జూ||
(అతను వెళ్ళిపోయాడు)

వసంతసేన :
చూడవే మదనికా ఈ వింతలోకం
మనిషంటే మనిషికిట ఎంత భయమో చూడు||చూ||
పదినున్నర్లాలకు బ్రతుకు బండరాయాయె
రత్నరాసులు కొన్న రాజుగా వున్నాయి
చారుదత్తుని ఇంట సిరి తొలగి నాది
స్వర్గలోకములోన కళ తొలగి నాది ||చూ||

మదనిక : (మేడమీద నుండి క్రిందికి చూచింది)
అమ్మ! అమ్మ! అటుచూడు జనులంతా భయపడిరి
మన ఏనుగు కట్లు తెంచి వీధిన విహరిస్తోంది ||అ||
మావటీని తొండముతో గిరవాటేసింది
అటు పోయిన సంవాహకు దంతాలతో ఎత్తింది
పూర్ణకుడు అటు వెళ్ళి ఇనుపకోలతో పొడిచెను
ఘీంకరించి ఆ ఏనుగు సంవాహకునీ విడిచెను ||అ||
పూర్ణకునికి ఎందరో కానుకలిస్తున్నారు
వారిలో ఒకదాత ఏదో ఇవ్వ చూచాడు
చెంతను ఏమియు లేక ఉత్తరీయమిచ్చాడు
కర్ణపూర్ణకుడిటకు వచ్చుచూ యున్నాడు ||అ||

వసంతసేన :
చూడవే మదనిక ఈ వింతలోకం
మనిషంటే మనిషికి ఎంత అభిమానమో ||చూ||

ఆదాత ఎవ్వరో తెలుసుకున్నావా?
ఆత్యాగ బుద్ధియే చారుదత్తు చెన్న!
(పూర్ణకుడు ఇచ్చాడు ఉత్తరీయం చూపాడు)
ఈ ఉత్తరీయమే సుగణాల సౌరభము
పూర్ణకా! నీవెంత అదృష్టశాలివో ॥మా॥

5వ సీను - చారుదత్తుని ఇల్లు

(శర్విలకుడు గోడకు కన్నం వేస్తున్నాడు. లోపల మైత్రేయుడు తల కింద మూటతో నిద్రిస్తున్నాడు)
కన్నం వేసేస్తా కుంభాకృతిలో
ఓరర్థం వేసేస్తా చంద్రాకృతిలో ॥కన్నం॥
చంద్రమా తొలగిపో తొందరగా
ఓ తిమోరాసి ఆవరించు బిరబిరా
నాంకష్ట జేపతా నీకు దండాలు కోటిదండాలు
యోగరోచనా! గురుభాస్కరా మీకు వందనాలు
॥కన్నం॥

(యజ్ఞోపవీతంతో కొలతలు వేసి—
కన్నం వేసి ఇంటిలో దూరాడు)
రాక రాక వచ్చాను దరిద్రాల ఇంటిలోకి
యజ్ఞోపవీతంతో ఎంతో చక్కగా కొలిచి
చక్క చక్క వొలిచి రాయిరాయి తీసి
వీపు సుంత గీసుకున్న దూరి నేవచ్చాను ॥రాక॥

మైత్రేయుడు : (నిద్రలో జోగుతూ మూటపట్టుకున్నాడు)
మిత్రమా చారుదత్త చంపకేయ్యి నన్ను
వద్దంటే ఇచ్చావు ఈ సువర్ణభాండం ॥మిత్ర॥

ఎక్కడ జాగా లేనటు ఇక్కడ దాచిందావిడ
ఏ దొంగో కన్న మేసి దొంగులుకి పోగలడు
(శర్విలకుడు మూట మీద చెయ్యివేశాడు. ఆ
ఆ చెయ్యిపైన మైత్రేయుడు చెయ్యి వేశాడు)
అయినా ఓ చారుదత్తనీచెయ్యి వుండేమి చమ్మగా
ఇది పుచ్చుకోకపోతే నా నెత్తిమీద పెద్దొట్టే ॥మి్రతి॥
(శర్విలకుడు మూట తీసుకుని వీధిలోకి వచ్చాడు
మైత్రేయుడు నిద్రపోయాడు)

శర్విలకుడు :

భలే రాత్రి భలే రాత్రి ఈ చీకటిరాత్రి
దేవతలు కరుణించి కార్యం తీర్చేశారు ॥భ॥

ఈ మొద్దు నిద్దరలో సొమ్ములు నాకిచ్చాడు
కత్తికి పని లేకుండా కాసులు అందించాడు
హాయిగా నిదురబో తిండిపోతు బ్రహ్మయ్య
ఈ నగలతో నామదనిక చెర విడిపిస్తానయ్య ॥భ॥

(తెల్లవారింది— చారుదత్తుడు వచ్చి కన్నం చూశాడు
మైత్రేయుణ్ణి నిద్ర లేపాడు)

చారుదత్తుడు :

కన్నము వేసినవాడు కడుబీదవాడు
కాసుకే కొరగాని శ్రమను చేశాడు ॥కన్న॥

శూన్య గృహమున చౌర్య కళకేమి ఫలము?
శ్రమ నిష్ఫలమై ఆతను విలపించెనేమో!

పేద తనమా నీవు విశ్వరూపము చాలు
పోపోవే ఇక వేగ నాకల్లు పీకి ॥కన్న॥

మైత్రేయుడు :
మిత్రమా చారుదత్త నగలు భద్ర పరిచావా?
నీ చేతికి అందించిన ఆమూటను దాచావా!

చారుదత్తుడు :
నగలేమిటి-మూటేమిటి-ఏమిటి నీమాట?
నా చేతికి అందించిన మూటేమిటి మిత్రమా?

మైత్రేయుడు :
అదే గదయ్యా మిత్రమా ఆ సువర్ణ భాండం
కళ్ళుమూసుకునే నేను నీకందించానుగదా? ॥

చారుదత్తుడు :
సరిసరిసరి ఆ చోరుడు అందుకు పోయాడు
వసంతసేన నగలు దాచిన ఫలమాయె యీ తీరు! ॥

మైత్రేయుడు :
దొంగలెత్తుకుపోతే మనమేమిటి చేస్తాం
పోతేపోయింది సొమ్ము దక్కిందిలె ప్రాణం! ॥

చారుదత్తుడు :
వసంతసేనకు వస్తువు ఏదో ఇవ్వాలికదా
నా మిత్రుడు జూదములో వోడెనని తెలుపు
నా శ్రీమతి రత్నావళి దానికి బదులుగ ఇవ్వు
ఆ విధముగ ఈ ఋణము తీర్చుకోనిమ్ము ॥వసం॥

మైత్రేయుడు :
ఎందుకయ్యా ఈ అవస్థ అప్పుడు చూచిందెవరు?

మాటాడక వూరుకోనును నాకు తెలియదనును ॥
హరిశ్చంద్రుడు కథను బోలు కథను అల్లకయ్యా
కాళ్ళువచ్చి రెక్కలొచ్చి ఎగిరిపోయె నగలు ॥ఎం॥

చారుదత్తుడు :
మనిషి బ్రతుకు మూడునాళ్ళు
మాట బ్రతుకు వెయ్యినాళ్ళు
మాటపోయి బ్రతుకు మనిషి
ప్రాణముండి చచ్చినట్లే ॥మ

6 వ సీను-వసంతసేన ఇల్లు
(వసంతసేన ఇల్లు సర్వాంగ సుందరంగా వుంది. శర్వి లకుడు నగలమూటతో వచ్చాడు. ప్రియురాలు మదనికను పిలిచాడు)

శర్విలకుడు :
మదనికా నా మదనికా యజమానురాలితో
చెప్పి, నగలు నేను ఇస్తానా చరను విడవనుని ॥మ॥

మదనిక :
సరేసరే ఎక్కడివి ఈ నగలు
మా వసంతమ్మ నగలు
చారుదత్తుల వారియింట కన్నం వేశావా?
అడ్డుపడ్డ వారినెల్ల పొట్టపెట్టుకున్నావా? ॥

శర్విలకుడు :
కొట్టలేదు తిట్టలేదు కత్తికి పనిచెప్పలేదు
వెదకిబోయిన దేదో ఈ కాలికి తగిలినట్లు
నగలు చేతికందాయి మనకు పనికివచ్చాయి ॥

మదనిక :

వద్దు వద్దు ఇచ్చివెయ్యి చారుదత్తులవారికి
ఈ నగ యజమానిచూచి మెచ్చదయ్యా మనపనికి ॥

(వసంతసేన వచ్చి నిలచి వింటున్నది)

శర్విలకుడు :

ఆపదలూ అబద్ధాలు ఆడవాని సొమ్ములు
అందంగా కథనల్లు అది నే చెప్పేస్తాను ॥

మదనిక :

చారుదత్తులవారు అది పంపినట్లు చెప్ప
నీ బాధలు నా చరలు తీర్చగ తానొప్ప ॥

వసంతసేన :

మదనికా నా మదనికా మీ కథనంతా విన్నాను
వినండి మీకొక మంచి కథను చెపుతాను ॥మ॥
చారుదత్తులవారు నాకు ఇలా చెప్పివున్నారు
నీ నగ నీ చేతికి ఎవరు తెచ్చి ఇస్తారో
వారికి నీ మదనికను కానుకగా ఇవ్వమని
మీరు వెడలి ఆయనకడ ఆశీస్సులు పొందండి ॥మ॥

మదనిక :

అమ్మా! క్షమియింపు మమ్మ నే చేసిన తప్పులు
అమ్మ ఆశీర్వదించు మా ఆశల బ్రతుకులు ॥అ॥

వసంతసేన :

నాకన్నా వేయిరెట్లు మనసునిండె సంతసమూ
మహిలో వలచినవాడు దొరకుటె అత్యంతసము ॥నా
ఇలలో ఐశ్వర్యం అందుకునే మార్గాలు

వున్నవి ఎన్నెన్నో అవన్నీ నాకు బానిసలు
హృదయము నిండిన ఈశ్వరుడు కంటికి కనరాడు
నీ ఈశ్వరుడే నీకయి చేయిచాచె నదే చూడు ॥నా॥
కలకాలం సుఖముగ కలలు పంటలుపండి
వాడి పండి బ్రతుకుపండి సుఖముగ నుసండి
మనిషీ మనిషికివున్న తేడాలను చూడండి
మంచిపెంచేమార్గం మదిలో ఎవుడుంచండి ॥నా॥

శర్విలకుడు :

చారుదత్తు త్యాగాలకు జోహారులు వేనవేలు
ఆర్యకుని విప్లవాన్ని ఆపలేవు చెరసాలలు ॥చా॥
నేను ఇపుడు విప్లవపోరాటములో నడవాలి
మదనికను నా మిత్రుని గృహములోన వుంచాలి
భగవతీ నీకు శుభం చల్లగ వర్ధిల్లు భువిని
విప్లవం జయిస్తుంది. ఆర్యకుడీల రాజౌను ॥చా
(మదనికను తీసుకుని శర్విలకుడు వెళ్ళిపోయాడు)

మైత్రేయుడు :

(వచ్చాడు— వసంతసేనను పరీక్షించాడు)
వసంతసేనా! ఓ వసంతసేనా!
నీ ఇల్లు ఇదియేనా అది నిజమేనా! ॥వ॥
ముంగిటిలో ముగ్గులు పెరడంతా పశువులు
పూదోటా ఫలవృక్షాల్ మాటాడె చిలుకలు
సింహద్వారము చూస్తే కళానిలయమని తెలిసె
పఠనశాల గానశాల ప్రియమైన భోజనశాల ॥వ॥
అలంకరణ పాకకళ అతిధుల శాసనములు

మహారాజు కోటవలె కళాత్మకం నీ యిల్లు
మీ అమ్మ- మీ అన్న-దాసులూ రక్షకులూ
కన్నుల పండువాయె నా జన్మకు నేడు ||వ||

వసంతసేన :
వందనాలు వందనాలు మీ మిత్రులు కుశలమా
ఆజ్ఞలు సెలవియ్యండి ఆచరించుతాను ||వ||

మైత్రేయుడు :
మా మిత్రుడు మీకై ఒక విన్నపమ్ము అంపి
ఆగ్రహించకుండ మిమ్ము
అవధరించుమనియెను ||మా||
అభ్యాసము అవధులు చెడి జూదమునే ఆడి
తమకంలో మీ నగలను చిత్తుగాను ఓడి
బదులుకు బదులుగ ఈ రత్నావళి మీకిచ్చి
ఋణముతీర్చుకున్నట్లుగ విన్నపమ్ము చేసె ||మా||

వసంతసేన :
రత్నావళి అందుకొనగ నాకేమిటి చింత
జూదరి మీ మిత్రుని చూడగలను వాకింత ||ర||
(వసంతసేన నవ్వుకుంటున్నది— మైత్రేయుడు తిట్టు కుంటున్నాడు)

7 వ సీను : చారుదత్తుని ఇల్లు
(సుందరమైన భవనం శిథిలావస్థలో వున్నది. చిందర వందరగా వున్నది)
(రోహసేనుడు మట్టిబండితో ఆడనని అలుక. రదనిక వోదార్పు)

రోహసేనుడు :

నాకొద్దు నాకొద్దు మట్టిబండి
కావాలి కావాలి బంగరుబండి ॥నా॥

వనములు నే తిరగాలి పూదోటలు తిరగాలి
అలసిపోక పరుగుతీయు గుర్రాలే కావాలి ॥నా॥

గుర్రాలకు కళ్ళెము-నా చేతికి చెర్నకోల
బంగారపు సింగారపు బొమ్మలు కావాలి ॥నా॥

రదనిక :

మంటిబండి ఆటలోన మజావున్నది
బంగారపుబండి మనకు లేకున్నది ॥మం॥

వున్నదానితోటి ఆడి మురిసిపోవాలి
మనసంతా ఆనందం నింపుకోవాలి ॥మం॥

వసంతసేన :

రోహసేనుడా నేను చూడ లేనురా
బంగారు బండి నీకు చేయిస్తారా ॥రో॥

రదనికా నగలివిగో అగసాలికి ఇవ్వవే
రోహసేను కోర్కె తీరు బండిని అందివ్వవే ॥రో॥

(వసంతసేన నగలు మట్టి బండిలో వేసింది)

రోహసేనుడు :

ఎవరివమ్మ నీవు నాకేమిటి అవుతావు
నీనగలు వొలిచి నాకెందుకు ఇచ్చావు ॥

రదనిక :

నీకు ఇంకో అమ్మ ఈమె కొత్తమ్మ
నీనంటే ఆమెకు ఎంతో ఎంతో ప్రేమ ॥

రోహసేనుడు :

ఛీ పోవే నమ్మను అబద్ధాల రదనిక
రథచక్రాలవలె బొంకులు దొర్లించకు॥

వసంతసేన :

అబద్ధాలు సబద్ధాలు ఆలోచించకోయి
హాయిగా మనసుతీర ఆటలాడవోయి ॥
రానున్న జీవితాన కావలె నిబద్ధత
రాపిడిలో రాటుదేలి రాణించు రోహిత ॥
రదనికా నేపోవలె వేవేగమె చెప్పవే
చారుదత్తులవారెట నున్నరో తెలుపవే ॥

రదనిక :

అయ్యవారు ఉదయమే పూదోటకు వెళ్ళిరి
నీవు కోరినట్లయితే మాబండి కలదు ఓసిరి ॥
మా వర్ధమాను బండిపై వేవేగమె పోవచ్చు
చారుదత్తుల వారిని చేరుకొనవచ్చు ॥

వసంతసేన :

ఉండమను ఉండమను ఎద్దు బండిని
ఒక్క చిటికెలో నత్తును సింగారించుకుని ॥
(వసంతసేన లోపలికి వెళ్ళింది. రదనిక బయటకు వెళ్ళింది.)

కిన సీను - శకారుని తోట

(తోటలోకి ఎద్దుబండి వస్తున్నది)

స్థావరకుడు :

హైహై హైహై పోవె పోవె బండి

పొగురుబోతు ఎద్దుబండి తిన్నగ ॥
పుష్పకరండక తోటకి పూలబాటలో
పావరకు పైగ చేయ సరాసరిగ సరిగ ॥

వసంతసేన :
ఏమి బండి ఎవరి బండి ఎక్కినానయా
బ్రతుకూ బండీమారి భవిత బండలాయె ॥

శకారుడు : (వచ్చాడు)
ఆడదానా ఆడేదానా
అందమైనా దంతపు వీణా ॥ఆ॥
నిను ప్రేమించేశాను నేనూ
నను ప్రేమించేశయవె నీవూ ॥
పూవులు ఆకులు సింగారించుకుని
పూజల పుణ్యాలు మూట కట్టుకుని ॥
కాచుకు కూచున్నానే నీకోసం
కితకితలాటాడు కాసేపు సుఖం కోసం ॥

విటుడు :
శకారా! మూడింది నీకు ఈ పూట
శకారా! పోయాదు ఆర్యకుడు చేయి వాటి ॥
పిష్లవకారులు విజృంభించారు
ఆర్యకుణ్ణి చెరసాల విడిచి పెట్టింది ॥

వసంతసేన :
మోసగించి రప్పించావు మూర్ఖుడా
నీకు నాశనమ్మె దాపురించె నీచుడా ॥
నా హృదయంలో చారుదత్తు నెలకొన్నాడు

సనాతని చరణాలకు దాసినై తినాడు
దాసులకు దేవులకు వున్నది బంధం
నీచుడా నీతో నాకేమి సంబంధం॥

శకారుడు :

వినవె వినవె వినవే సేనవసంత
ఘనమేనే వసంతాల సేవకు హితులం ॥వి॥
విను ద్రౌపది చేస్తాను పట్టం కట్టేస్తాను
నిను చంద్రమతిని చేసి కాశిలో అమ్మేస్తాను
కాదు కాదు కాశీకి రాణిని చేస్తాను
రాణిని చేసి నీకు పాదపూజ జేస్తాను ॥వి॥

వసంతసేన :

సిరాశలు ఏలరా? శృంగలాభాలు ఏలరా?
నీ విలువ దేశాన శకారుడేరా!
నీ గుణమున సత్వము జౌచిత్యము లేదు
నీచాలు ప్రలోభాలు నన్ను చేరలేవు

శకారుడు :

చంపి వేయరా దీనిని చంపి వేయరా
నామాటకు ఎదురాడి నన్ను తూలనాడునా ॥చం॥
ఓరి విటుడు బావా? నా బానిస స్థావరకా
మీకు నిధులిస్తా పదవు లెన్నో ఇస్తా
బంగారం బహుమానిగా ఎంతైనా ఇస్తా
కోరినదేదైనా ఇస్తా- నాకోరిక తీర్చండిరా ॥చం॥

విటుడు, స్థావరకుడు :

పెడితే తింటాము, నీవంటే పడతాము

నీ ప్రతిబింబమైన సేనలెన్నో చేస్తాము ॥పె॥
ప్రాణాలను తీయము, పాపాలను చేయము
చెల్లిలాంటి, తల్లిలాంటి ఆడదాన్ని అంటము ॥పె॥

శకారుడు :
ఓరి వెధవలారా!— ఓసోసీ రాకాసి !!
చాణుక్యుడు ఆనాడు సీతను చంపిన యటుల
తాటకినీ భీముడన్న కూల్చిన యటుల
ద్రౌపదినీ శ్రీకృష్ణుడు మానం దోచిన యటుల
శకారుడిచట నిన్ను చంపివేస్తున్నాడు—
(వసంతసేన గొంతుపిసుకుతాడు, వసంతసేన చావు
కేక పెడుతుంది. శకారుడు భయపడివదిలేశాడు)

విటుడు :
మర్రి కొమ్మవిరిగిపడి వెర్రిది చని పోయిందరా॥
ఇకరారా చిత్రకా, కాణేలీ మాతృకా ॥
ఆడదాని వుసురు నీకు తగులుకేనురా
ఎందుమర్రి ఆకులతో కప్పి వేయరా
భిక్షుకుడెవడో ఇచటకొస్తున్నాడు
చల్లగా రాచనగరు జారుకోరా ॥
(విటుడు, శకారుడు, ఆకులు కప్పి వెళ్ళిపోయారు)

భిక్షువు : (వచ్చాక)
బుద్ధం శరణం గచ్ఛామి !
సంఘం శరణం గచ్ఛామి !
ధర్మం శరణం గచ్ఛామి !
బుద్ధం శరణం గచ్ఛామి !

జీవితాన ఆశలను వదిలేశాను
సంఘాన్ని ధర్మాన్ని ఆశ్రయించాను ॥జీ॥
బుద్ధదేవుని బోధలు ఇలలోన చాటుచు
చేతనయిన రీతులలో ప్రజాసేవ చేయుచు
దేశాటనతో తనువును గడిపేస్తాను
పరోపకార ధర్మమె పాటిస్తాను ॥జీ॥
(తనపైవున్న తడివస్త్రం ఆకుల కుప్పపై ఆరవేశాడు, ఆకులలో కదలిక)
ఇదియేమి గలగల యెండుటాకు రాసిలో
ఇదియేమి చిత్రము మానవ శరీరమూ ॥
(ఆకులు పూర్తిగా తొలగించాడు ఆశ్చర్యంగా చూచాడు)
ఇదియేమి చిత్రము వసంతసేన దర్శనము!
అమ్మా! ఇది ఏమిటి? ఈ దుర్గతి నీకేమి? ॥

వసంతసేన :

పాపి శకారుడు నన్ను బలవంతము చేసి
లొంగని నను ఇటనె చంపివేసెను
నా పంచప్రాణాలు నన్ను వీడిపోలేదు
బతికినాను బతికినాను చారుదత్తు స్మరణతో ॥

9వ సీను—రాచకచేరి

(భటులు, శకారుడు, చారుదత్తుడు, అధికారి వున్నారు)

శకారుడు :

ఓ! రాజోద్యోగుల్లారా
రాజుగారి బావమరిదిని॥

గొప్ప నేరమొకటి నేను కట్టి తెచ్చాను ।
వీడు చారుదత్తుడు కామానికి మిత్రుడు
పేదరికపు చిత్తులో పాపాలను చేశాడు ।
మంటి బండినుండి బంగారు బండికోరి
ఆ బంగారు కోసమే దేవదాసిని హత్యచేసెను ।
కాళ్ళూ చేతులు నరికి వీనితలను నరికి
కాకులను గద్దలను విందులు చేయండి ।

రాజోద్యోగి :
దేవుని ఎదుట ప్రమాణముచేసి
చారుదత్త చెప్పుమా నిజము నిజముగా ।

చారుదత్తుడు :
దేవుని ఎదుట ప్రమాణముచేసి
నీతిగ చెబుతాను నిజము నిజముగా ।
ఈ వగలగూర్చి నాకు తెలియదు
ఆమె హత్యగురించి నేను ఎరుగను ।
ఆమె నాకు తెలుసు నేనామెకు తెలుసు
మనసు మనసుకు తెలుసు మర్మమేమి లేదు ।
వసంతసేనను నే చంపగ పని లేదు
అంచలాలెక్కాలను ఆశ నాకు లేదు ।
శకారుడు వికారముగ కుళ్ళునోటితో
ఏదేదో చెప్పినాడు ఏదీ నే నెరుగను ।

రాజోద్యోగి :
దేవుడు నా మనసును శాసించినట్టుల
ధర్మము కాపాడగ నా మనసు చెప్పినట్టుల

చెప్పుచున్నాను నే చేసిన తీరుపు॥
చారుదత్తుడే నగలు దొంగిలించినట్లు
చారుదత్తుడే ఆమెను చంపినయట్లు
ఆరోపణాల వెనుక ఆధారము లున్నవి
ఆతను నిర్దోషియనే సాక్ష్యమే లేదు॥
చారుదత్తుని శిరము వధ్యపై నరకండి
వొంటికింబళు బండిన వూరంతా త్రిప్పండి
కుంకుమ బొట్టుపెట్టి గన్నేరులదండ వేసి
ప్రజలనూ హెచ్చరిస్తు వధ్యకు చేర్చండి॥

10 వ సీను-వీథుల్లో

ప్రజలు :

అన్యాయం, అన్యాయం, అన్యాయం
న్యాయము కరువాయెను నేడు॥
ఆర్యకుడే విజృంభించెను నేడు
యాదవులెల్లరు లేచిరి ఈనాడు
ఆయుధాలు ధరించి రాజును వధించి
సత్యరాజ్యమిప్పుడే స్థాపిస్తున్నారు॥

విటుడు :

(శకారుడు వనంలో అడ్డంగా పారిపోయాడు)
పారిపోకు పారిపోకు శకారా
నీకుదూర సందు లేదు వికారా॥

శర్విలకుడు :

చేయకూడదన్న పాపాలను చేశావుర
చూడకూడదన్న ఘోరాలను చూశావురా॥

రదనిక :

రాక్షసిలా నగరునంత నాశనము చేశావురా
రాబందా గాలివాన వచ్చేపిదె చూడరా॥

రోహసేనుడు :

నాన్నా! నాన్నా! నిలువుమయ్యా
ప్రేమగా ఒక్కముద్దు నీయగదయ్యా॥
పసివాడను నేను ప్రేమకోరుతాను
ఏడ్చే నా తల్లి మోముచూడు! నేను చూడలేను॥

వసంతసేన :

చారుదత్తు మహాశయుడు నిర్దోషి
పాతకాలను నేరచకే బ్రతికున్నాను॥
శకారుడే నా ప్రాణం పోయెనని
తను చేసిన హత్యను తిప్పిచెప్పెను॥
నిజమైన హంతకుని నిర్బంధించండి
నీతిని అభిమతములను కాపాడండి॥
అన్నెము పున్నెము ఎరిగి శిక్షలు చెప్పండి
అధికార దాహముతో కన్ను మూగకండి॥

ప్రజలు :

పట్టండి కొట్టండి పాపిని
పాపాల ప్రతిరూపి శకారుని॥

ఆర్యకుడు :

విప్లవం జయించింది ప్రజలారా
కలిసిమెలిసి పాలకులు ప్రజలారా!
చారుదత్తు మహాశయుకు శిక్షరద్దు
పసివానికి ఇస్తాను అతను ముద్దు!
ప్రేమలు ప్రపంచంలో జయమందాలి
ప్రజల్లో శాంతి సుఖం పెంపొందాలి
రాచరికపు దుర్గాల్లో దాగినవాడు
అధికారం అల్పబుద్ధి నేర్పినవాడు
ఈ సంక్షోభం సృష్టించిన శకారుడు
శిక్షార్హుడు, శిక్షార్హుడు, శిక్షార్హుడు.

(ప్రజలు శకారుణ్ణి పట్టితెచ్చి ఆర్యకునివద్ద పడవేశారు)

సమాప్తం

# కాకమ్మ

'కాకి కబురు' ఆంధ్రదేశంలో అతి సహజమైనమాట. "కాకితో కబురు చేస్తే వచ్చి వాలకపోయానా!!". ఇంతపై కొన్ని వ్యాఖ్యలు చేయవచ్చు. వాయస శకునం శుభాశుభాలకు ఒక సంకేతం. కాకి అరిస్తే చుట్టాలు వస్తున్నట్లు హెచ్చరిక. కాకి నెత్తిన తన్నితే ఆప్తులకు ఎక్కడో కీడు జరిగినట్లు శంక. భారతదేశపు కథల్లో ఎక్కడా కాకితో కబుర్లు పంపడం జరగలేదు. నలదమయంతుల మధ్య హంస రాయబారం వుంది-ఇది పురాణ సంబంధం. చరిత్రగాథల్లో పావురాలు తపాలా శాఖలా పనిచేసిన దాఖలాలున్నాయి.

కాని ఈ గేయం సెంటిమెంటుదృష్ట్యా రాయబడింది. ఒక పేదరాలు జీవితాన్ని ఆర్ద్రతతో పరిచయం చేయటానికి వినియోగించుకున్నాను. పేదరాలికి పావురం, హంస, అందుబాటులోనివి కావు. కాకి మాత్రమే పేదలు పిలవంగానే పలుకుతుంది ధనిక వర్గం పేదల్ని కాకుల్లా పోల్చుకుంటారు. మరోవిషయం ఆడపిల్ల గురించి. ఆడపిల్ల అత్తవారింటికి పోయేపుడు కంటతడి పెట్టుకుంటుంది. తన యోగక్షేమాలు కనిపెట్టి వుండమని తల్లికి చెప్తుంటుంది, ఏమాత్రపు బాధ కలిగినా 'అమ్మా' అనుకుంటుంది. భర్త కనుమరుగై బ్రతుకు దుర్భరమైన ఈ పేదయువతి తన తల్లికి కాకితో చేసిన కబురులో

నీ చల్లని కాలికాడ
కూలిపోవు కోర్కెతోడ
కదలలేక కాచుకుంది

రమ్మంది చూసమంది—అని చెప్పుకుంటుంది. ఇది కరుణరస ప్రధానమైన కల్పన. ఇప్పటికీ పామర జనంలో కాకి శకునంపై నమ్మకం వుంది.

(కాకి నెత్తిన వాలితే ఆప్తులకు ఆపద సంభవించి వుంటుందని జానపదుల నమ్మకం.)

కాకమ్మా
కాకమ్మా
ఒక్కసారి నన్నుచూడమ్మా!
ఒక్క కంట నన్ను చూడమ్మా
ఒక్కమాట నాతో చెప్పమ్మా! ॥
మనిషికంటె ముందు లేచి
బ్రతుకుదెరువు చూచుకుంటూ
ఓపికున్న మేరల్లో
తిరిగి తిరిగి తిండితిని
పిల్లలకని ముక్కునగొని
ఎక్కువగా నస్తావు కదూ!
పచ్చని ఆ చెట్టుపైన
చక్కని నీ గూటిలోన
కూనలు నోళ్ళు తెరువగ
తెచ్చినట్టి ఎరనుపెట్టి

ఆనందిస్తావు కదూ?
కాకమ్మా కాకమ్మా
నీపిల్లలు నీకు
ఎంత ముద్దమ్మా
శాపతోను ఎప్పుడూ
నీకెంతో హాయికదూ?
ఔను కదూ! నిజం కదూ!
జోరుగా తోడుగా
ఆకాశపు వీధుల్లో
అలుపు లేక ఎగురుతావు
హాయిగ తిరిగొస్తారు కదూ!!

చల్లని ఆ సంధ్యల్లో
రెక్క విదని పిల్లలతో
ఇరుగు పొరుగు వారలతో
కల కల గల గల
కాకారవాలు చేసి
ఆలోచన సాలోచన
చేసుకుని, కూసుకుని
హాయిగా మాయగా
నిదురిస్తావు కదూ!!

o o o o

కాకమ్మా! కాకమ్మా!
నీవు లేచిఎపుడు

నా బావ లేస్తున్నాడు
నీవు పోయినట్టులే
ఇల్లు వెడలి పోతాడు
బ్రతుకు తెరువు
వెతికి వెతికి
గతుకుతుటకన్నా
దొరకని కసితో
విసిగి వేసారి
నీరసంగ ఇల్లు చేరి
నాను ముగము చూడలేక
బిడ్డల గతి కనగలేక
ఆకసంతో అక్కసుతో
అరచి అరచి అరుస్తాడు
తలచి తలచి పిలుస్తాడు
మినుకు మినుకు మను తారలు
మిన్నక వుంటున్నాయే!!

• • •

కాకమ్మా కాకమ్మా
బావ ఇప్పుడు ఇంట లేడు
మనిషి కంటబడుట లేదు
ఆ రాతిరి చీకటిలో
పగిలిన మనసును
చిరిగిన జీవితాన్ని

ఆశలతో చుట్ట చుట్టి
అడియాసల గంపకెత్తి
అటునెటో పోయావు బావా!

బావ జాడ మరి తెలియదు
ఆ దారులు చూచి చూచి
నా కన్నులు కాయకాచె
నా గుండెలు బండబారి
మండి మండి చల్లారెను
సంసారము చల్లబడెను
పోషించిన పసికందును
పోషించే శక్తి లేదు
కాకమ్మా! కాకమ్మా!
నా కిప్పుడు
బ్రతుకంటే భయమమ్మా
మనిషంటే వెగటమ్మా
ప్రేమ కొంత్తో విలువనిచ్చి
ఆసించిన సంసారం
పెద్దదయ్యె! పెరిగిపోయె!
మెట్టినిల్లు మట్టిగలిసి
నన్ను చూచి నవ్వుతోంది
అడుగడుగున ఇపుడు నాకు
అమ్మ గడప అమ్మ కడుపు
అమ్మతోడు అమ్మనీడ

అక్కర కొడ్డాదమ్మా
ఒక్క అడుగు ముందు వెళ్ళి
చెప్పమ్మా అమ్మతోటి
చిన్నబిడ్డ ముద్దుబిడ్డ
ఎదపెంచి వెతలనించి
ఒంటరిగా బ్రతుకుతూంది
నీచల్లని కాలికాడ
తూలిపోవు కోర్కెతోడ
కదలలేక కాచుకుంది
రమ్మంది చూడమంది
అనేమాట చెప్పమ్మా
అమ్మతోటి చెప్పమ్మా!

# రూపకాలు

లలితకళలను పంచప్రాణాలుగా కలిగినదే రూపకం. రూపకమనే ప్రతి దానిలోనూ సాహిత్యం, శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాట్యం వుంటాయి. నాటక ప్రదర్శనాలలో శిల్ప + చిత్రలేఖనం కలిసి ఆయా పాత్రల ఆహార్యంగా రూపుధరిస్తాయి. నర్తకి వేషరచన చేసుకొనగానే చిత్రలేఖ సంచే అలంకరించబడిన శిల్పంగా అవతరిస్తుంది. మూర్తిమంతమై ఆంగిక + సాత్త్వికం కలిసి జీవంపోసుకుంటుంది. అప్పుడు నటి తన పూర్వధర్మాలన్నీ వదలి పాత్రధర్మాలలో జీవిస్తుంది. సంగీతం పాడి, నాట్యం ఆడి సాహిత్య సహాయంతో తానెవరో తన కథఏమిటో చెప్తుంది.

ఈ చెప్పే రూపాలను భరతముని నాట్యశాస్త్రంలో దశరూపకాలుగా చెప్పారు. అవన్నీ నేడు రూపాంతరం పొందాయి. వాటిని ఆ పేర్లతో పిలిస్తే అర్థంకాని పరిస్థితి ఏర్పడింది. ప్రస్తుత వాడుకలో పౌరాణికం, జానపదం ఊహాత్మకాలుగా చారిత్రకం, సాంఘికం హేతుబద్ధంగా కథలు చెబుతున్నాయి. నేటి నవనాగరిక పడమటి పు సిరిగాళ్ళు చరిత్ర సాంఘికాలను కూడా ఊహాత్మకం చేశారు. అది వేరే సంగతి—

## ప్రాచీనంతో

భరత నాట్యశాస్త్రంలో కథలు ఉపకథలు పరిశీలిస్తే మనకు నిర్ద్వంద్వంగా తెలిసే విషయం. నాట్యాధిదేవత నటరాజు అనగా నటరాజే శివుడు పరమేశ్వరుడు.

ఆధునిక శాస్త్రాలను గతితార్కిక దృష్టి భౌతికవాద దృష్టిని విశ్వసించలేనివారు ఆ కాలాన్ని కోట్లసంవత్సరాలతో లెక్కగడతారు. నాట్యం, దానికి మూలమైన లయ. కైలాసగిరి శిఖరంనుంచి పరమేశ్వరుడి కాలి అందె రాలి జారి భువికి చేరడంవల్ల భరతఖండంలో, భరతనాట్యరీతులు భరతమునిచే విరచితంబై మానవ గణానికి అందచేయబడ్డాయని వారి విశ్వాసం.

భక్తిపరమైన విశ్వాసం- ధర్మకార్య నిర్వహణకు పరిమితమైతే, సర్వజన శ్రేయోదాయమైతే, దుష్టశిక్షణకు శిష్టరక్షణకు వినియోగపడే భక్తిని మానవులందరూ ఆచరించవలసిందే. నాట్యం పుట్టుకకు ఆలంబనమైన అంశాలలో శివుడు, త్రిపురాసుని సంహరించడం; భవాని శక్తి రూపుదాల్చి మహిషాసురుని సంహరించడం లోకరక్షణార్థమనే విషయం అందరూ ఆమోదించవచ్చు. రాక్షసులు, పరరూపరాక్షసులు, అపురూపరాక్షసులను నశింపచేయడం నాట్యలక్షణ విశేషాల్లో ఓ భాగంగా కూడా పరిగణించబడి ఉన్నాయి.

బ్రహ్మ క్షీర సాగర మథనం అనే నాట్యరూపకం సృష్టించి ప్రదర్శింప చేసినపుడు, రాక్షసుల పాత్రలపై ప్రేక్షకులకు దుష్టభావం కలిగించిందని అలా జరగటం తమకు అన్యాయంగా తోచిందని దానిని మార్చమని రాక్షసులు బ్రహ్మను కోరినప్పుడు బ్రహ్మ అది తప్పదు దుష్టపాత్రలు శిష్టపాత్రలూ వుంటేనే నాటకం అని చెప్పాడు.

కాని నేటి ఆధునిక సినిమావినోద విలోభ విజ్ఞానాత్మక ప్రదర్శనలు మాత్రమే కోరే కుసంస్కారులు ఆ బ్రహ్మ చెప్పిన దానికి కూడా వ్యతిరేకం—నోటితో అంగీకరిస్తారు—నొసలుతో వ్యతిరేకిస్తారు—చేతితో తుడిచివేస్తారు.

శివుని కథలు చాలా భాగం దేవతలకు వ్యతిరేకం—విష్ణు కథలు చాలాభాగం రాక్షసులకు వ్యతిరేకం—ఇది అనాదినుంచి కథా సంవిధానంలో కానవస్తున్న వైరుధ్యం.

ఇక్కడ నాట్యశాస్త్ర సంబంధమైన నృత్యం నాటకం తోనే ప్రారంభమైనట్లు వేదాల్లోని యమి-యమ సంవాదం బ్రహ్మదేవునిచే రచించబడిన క్షీరసాగర మథనం అత్యంత ఆదికాలపు సంగీత నృత్య నాటకాలు.

ఎవరు సృష్టించినా ఎవరు ప్రదర్శించినా అవి శివుని వల్ల అతని ప్రియపుత్రుడైన వినాయకుని వల్ల భరతముని ద్వారా భూలోక వాసులకు అందాయన్నది పౌరాణికులు అందరూ ఆమోదించే విషయం. చిన్నచిన్న కథాంశాలూ విభిన్న భావనలూ సరసనే వున్నాయి.

## ప్రేరణ ఎవరివి ?

పరమశివునికి కూడా ప్రకృతే ప్రేరణ కల్పించినట్లు గ్రంథాల్లో వున్నది. దుష్ట పరిస్థితులు, దుష్టులు ఆయనలో సహజకోపాన్ని కలిగించినట్లు కథలున్నాయి. రౌద్రరస ప్రధానమైన నాట్యాలు దుష్టసంహారానంతరం కలిగాయి- అది చాలా సహజం. శృంగార సంబంధమైన నాట్యాలు ప్రకృతి పురుషుని ఆకర్షించిన ధర్మంలో ఆవిర్భవించాయి.

ప్రతి నాట్యావతరణకు ప్రారంభం ఇలా వివరించ బడింది "పరమశ్వేశుడు కైలాస పర్వతారణ్యాలలో పార్వతీ దేవితో విహరిస్తున్నపుడు" అని చెప్పబడింది.

అలా విహరిస్తున్నప్పుడు, పక్షులు, జంతువులు, కీటకాలు వాటిజీవనధర్మ నిర్వహణలో అవి చేసిన విన్యాసాలు పరమశివునికి ప్రేరణఇచ్చాయని వివరణ. వినాయకుని కోరికపై కొన్ని, పార్వతీ దేవి కోరికపై కొన్ని, దేవతల కోరికపై కొన్ని నాట్యాలు సృష్టించాడు. అవి దేవవేశ్యలైన రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ, ఉలూచి, దేవసేన వగైరా అందరూ నేర్చినట్లు చెప్పబడింది. త్రిపురాసురుని సంహారానంతరం శివుని శాంతింప చేయడానికి, మహిషాసుర సంహారానంతరం మహాశక్తిని శాంతింప చేయడానికి రంభ నాట్యం చేసినట్లు చెప్పబడింది. మరికొన్ని కథాంశాలలో దేవపురుషులు, త్రిమూర్తులు చేసిన అన్నిరీతుల నాట్యాలను మేనక ఆకళించుకుని ప్రదర్శించి నట్లు కనపడుతుంది. కాని అందానికి, అభినయపాండిత్యానికి రంభా ఊర్వశీలను మాత్రమే గుర్తించారు

శివుడు సృష్టించిన ఈ నాట్యరూపాల చరిత్ర "హిందూ పాశ్చాత్య సాహిత్యం-కళలు సృష్టికి వేదిక అయినవి ప్రకృతి-ప్రాణుల కదలికలు" అనే సత్యాన్ని చాటుతున్నది.

[కురంగ శబ్దం: ఇది లేడికి సంబంధించిన విషయం. ఇందులో దాని ఆహార సంపాదన, విహారం, భయం, మందతో కలిసి జీవించటం, జోడితో జోడుకట్టి తన శృంగార జీవితం అను

భపించడం వంటివి చిత్రించబడతాయి. ఇందులో పాద విన్యాసం నేత్రవిన్యాసం, ప్రధానాలు.

మయూర శబ్దం: ఇది నెమలికి సంబంధించిన విషయం ఇందులో దాని ఆహార సేకరణ, విహారం, భయం, జంటతో కలిసి జీవితం, మేఘాలు ఆకాశాన్ని అలుముకున్నప్పుడు సూర్యకిరణాలపై మేఘాల తెరలుదిగినప్పుడు సంతోషంతో పురివిప్పి ఆడటం- దాని ఆటను దాని వెంటి ఆనందించి అను సరించటం వంటివి వుంటాయి.

తంతువాయశబ్దం: సాలెపురుగు గూడు నేయటంలో చిత్రవిచిత్రమైన నడకలు వుంటాయి. చివరగా వలలో చిక్కిన కీటకాన్ని పట్టుకోటం భక్షించటం వుంటాయి.

శశకశబ్దం: ఇది కుందేలుకు (చెవులపిల్లి) సంబంధించిన విషయం. ఆ అల్పజీవియొక్క ముద్దుముద్దు కదలికలన్నీ ఈ నాట్యంలో వుంటాయి.

చిక్రోడ శబ్దం: ఇది వుడుతకు సంబంధించిన విషయం. ఇదికూడా అల్పజీవి. దీని కదలికలు కూడా చాలాముద్దుగా వుంటాయి.

మండూకశబ్దం: ఇది చాలా కష్టసాధ్యమైన విన్యాసం. కూర్చుని పాద విన్యాసం, హస్తవిన్యాసం అభినయించటం కూర్చుని దూకడం విచిత్రంగా వుంటుంది.

భ్రమర కీటకశబ్దం: ఇది గండు తుమ్మెద కదలిక లను చూపుతుంది. ఇందులో ప్రధానమైనవి ఆత్మప్రదక్షిణ భంగిమలు. యూరప్‌లో "పాయింటు షూ" తొడనమీద

నర్తకులు బొంగరాల్లా తిరుగుతారు. కర్నాటక జానపద నృత్యాలలో పురుష పాత్రలన్నీ ఈ భ్రమర భంగిమలు విశేషంగా ప్రదర్శిస్తాయి.

మహోదధి శబ్దం: ఇది ప్రవాహసంబంధ విషయం. ముఖ్యంగా సముద్ర తరంగాలు. ఇది సముద్రుని ప్రా నుద్దేశించినది.

ఇలా ఈ శబ్దాలను పరిశీలిస్తే చక్కగా విరబూసిన లతాగుల్మాలు కదలిన - అందమైన జంతువు అందంగా గెంతిన - పక్షి ఆనందంగా విహరిస్తుంటే చూచి తానూ అలా వూగాలని, పరుగిడాలని, పైకెగరాలని ప్రయత్నించిన, మానవుని కోరికల రూపాల పరిణామక్రమమే! శాస్త్రబద్ధమైన గీతులు. నాట్యానికి మూలమైన ఈ విషయాలు మరుగున పడి కేవలం తాళం-ఆధారమై, శృంగారపు ఆధిక్యం, పురుషాకర్షక శృంగార విన్యాసాలు, శాస్త్రీయ నాట్యాలలో చోటు చేసుకున్నాయి. జన జీవన విషయం లోపించటంతో సామాన్య మానవులకు దూరమై రాజమందిరాల్లో వారి వినోదపాత్రలైన వేశ్యలకు, దేవుని పేర బానిసలైన దేవదాసీలకు పరిమితమైపోయాయి.

జానపదం - శాస్త్రీయం

శాస్త్రం తెలిసి దానిపై జీవితం ఆధారపడివున్న వారికి జానపదం పట్ల చిన్నచూపు. అలా ఎందుకు ఏర్పడిందన్న దానికి సమాధానం తేలికే అయినా మెత్తగా చెప్పటం అవసరం. శాస్త్రం అనబడేది లిపి సంబంధం. అనేక

రూపాలుగా మారింది. అందుకు శాసనాలే ఆధారం. నృత్య సంబంధంగా చూచినపుడు పాలకులు మారినపుడు పాలకుల మెప్పుకోసం అవికూడా మారాయి. అందుకు కారణం నేడు వాద్యవిశేషాలలో వున్న వాయులీనం ఉదాహరణగా చెప్పవచ్చు. అంతకు ముందు అరబ్బీల సంపర్కం వల్ల కొన్ని వాయిద్యాలు ఆంగ్లేయుల సంపర్కం వల్ల కొన్ని వాయిద్యాలు మన శాస్త్రకారులు ఆమోదించారు.

భారతీయతంత్రీ వాయిద్యాలు జర్మనీ, ఇటలీ దేశాల తంత్రులు ధరించి అభివృద్ధి చెందాయి. చర్మ వాయిద్యాలు కంజర, మృదంగం, డోలు వంటివి మినహాయించి డ్రమ్స్‌గా పిలవబడే అన్ని భారతీయాలు కావు. ఉదాహరణకు బేండు మేళం స్టిబస్ సింబల్‌గా పిలిచింది.

నృత్యాలలో నేటికీ జానపద-శాస్త్రీయాల మధ్య హాస్య-మకరం అంతరం వుంది. జానపదంలో విద్య-అలంకార ం-ఆర్థిక స్తోమతు-రాజకీయ ప్రాపకం కలవారిని వారి నాలను మాత్రమే గుర్తిస్తున్నారు.

శాస్త్రీయ కళలకు మాతృక జానపదం అంటే ఆశ్చర్యం కలుగవచ్చు. ఒక ప్రాంత జనపదుల ఆట పాటలు లయ విన్యాస భంగిమలు అంతకు ముందే శాస్త్రీయంగా స్థిరపడిన ఆట-పాట-లయ- విన్యాస భంగిమలకు వాడిగినపుడు—అతి కినపుడు—పండితులు ముద్రవేసినపుడు, రాజాశ్రయం లభించినపుడు ఆవికూడా శాస్త్రీయరూపం పొంది జానపదరూపం నుండి వేరయిపోతుంది. అందుకు శబ్దాలు వుదాహరణలు!

అందుచేతనే సాహిత్యంలోను, సంగీత, నృత్య, తాళ సంబంధ లక్షణ గ్రంథాలలో దేశ్యాలు, అన్యదేశ్యాలు, జనితాలు, సంకీర్ణాలు. అనే వివిధ రీతుల వివరణాలు వగైరా చెప్పబడ్డాయి వివిధ విషయాలలో.

ముఖ్యంగా నేడు వాద్య ప్రయోగాలలో వున్న 108 తాళాలకు గాను ప్రథమంగా పరమశివుని కాలిమువ్వ జారి భూమికి చేరిన దాని ధ్వని ఇలా వర్ణించారు. "తకిటత" "ధరికిట", "జధగిణ", "ఝుణుఝుంత" అంటూ 16శబ్దాలు (అక్షరాలు) పలికి ఆగిపోయిందట.

ఇక్కడ మరో విశేష మేమంటే కైలాస గిరి శిఖరాల నుంచి జారిన మువ్వ వే మైళ్ళు దాటివచ్చి కృష్ణాజిల్లా మొవ్వలో పడిందంటారు కొందరు పెద్దలు. వారి ఆనందం వారికే వుంచుదాం. మువ్వ తాళ విశేషణం—మొవ్వ నృత్య విశేషణం-అందునా కొమ్మలులేని చెట్టుకుండే లేతమట్టలను మొవ్వ అంటారు. శబ్దార్థ గ్రంథాలలో కూడా అలాగే వ్రాసి వుంది.

## ఆధునికంలో

మానవుని మానసోల్లాసం, అతని ఆనంద విన్యాసం, ప్రకృతి రామణీయకతకు అతని స్పందన లేడిలా ఆడాలని, కోకిలలా పాడాలని, పాములా పాకాలని పక్షిలా ఎగరాలని అతను చేసిన ప్రయత్నాలు; కిరల చప్పుళ్ళనూ, నడకల్లోని లాస్యాన్ని స్వీకరించి కళావిర్భావానికి మేధోవికాసానికి నాంది అయింది. అది ప్రజలకు జ్ఞాన

దాయినిగా, వినోద ప్రదాయినిగా అవతరించి చీకటి గుహల్లో దాగిన మానవత్వాన్ని మేల్కొలిపింది. నవ్య యుగాన్ని స్థాపించింది. నాటక కళ ద్వారా జీవితపు అనుభూతులను లక్ష్యాలను చైతన్యవంతంగా ప్రదర్శింపచేసింది.

యక్షగాన ఆవిర్భావం ఏనాడు జరిగిందో సరిగా ఎవరూ చెప్పలేని స్థితి. అయితే వేదాల్లో "యమూ-యమీ" సంవాదసూక్తమూ, బ్రహ్మచే రచించబడినట్లు భరతముని చెప్పిన "క్షీరసాగర మధనం" మనకు ప్రాథమిక నాటక రూపాలు.

తదుపరి భారత, రామాయణ గాథల్లో రాజాంతఃపురాల్లో, నృత్యగాన వినోదాలు మనకు కానవస్తాయి. సిద్ధార్థుని జనన కాలం నాటికే గీత, గాన, నాట్యాలు ఆనందోత్సవాల్లో వినపస్తున్నాయి.

తెలుగు దేశంలో హాలచక్రవర్తి కాలంలోనే ప్రత్యేక నాటక లక్షణాలు ఉన్నట్లు తెలుస్తున్నది. మానవుడు స్మృతి కళలు నేర్చినప్పుడే లలితకళల ఆవిర్భావం అభివృద్ధి ఆరంభమయింది. గాథా సప్తశతినాటి ప్రజల జీవనసరళి కళ్ళకు కట్టినట్లు కానవస్తుంది.

యక్షులు, కిన్నరులు, విద్యాధరులు దేవలోకసంబంధ కళాకారులయినట్లు కానవస్తుంది. కిన్నరులకు గానప్రధానమైన లక్షణాలు మాత్రం కానరావు.

జక్కులు, కురవంజిలు, భాగవతులు మానవసంబంధం గల కళాకారులుగా కానవస్తారు. వీరూ వారూ కుబేరులు త్రాలుకొనా పారిలా వున్నారు.

దక్షిణాపథంలో యక్షకన్యలు, జక్కుల పురంధ్రులు వున్నట్లు వారు అద్భుతమైన కళాప్రదర్శన తిచ్చినట్లు కావ్యాల్లో కానవస్తుంది. ఆటవిక జాతిగా అరణ్యమధ్యాల్లో గల దేవాలయాలకు యాత్రలు చేసే వారికి మార్గదర్శకులుగా దక్షిణాపథంలో అత్యంత ప్రాచీనులుగా కురవంజి స్త్రీలు కథాగానాల్లో అందెవేసిన వారిగా తెలియ వస్తారు.

యక్షగాన సంబంధంగా యక్షులు, జక్కులు, కురవంజిలు మనకు ప్రాచీన కళాకారులుగా మూడు స్థాయిల్లో కానవస్తారు. అయితే నేడు యక్షులు లేరు. కురవంజిలు ఎరుకల తెగవారిగా వున్నారు. జక్కులు వేశ్యజాతిగా కానవస్తారు. శాసనాల ద్వారా, ఇండ్లపేర్లు, గ్రామాల పేర్లతో "జక్కు" శబ్దం నేడు మనముందు చారిత్రక ఆధారంగా వుంది.

కిన్నర వీణా విశేషంగా, గంధర్వులు చక్కనిపాటకులుగా, కింపురుషులు కురూపులుగా, యక్షులు, జక్కులు రాచమర్యాదలు, కావ్యమర్యాదలు అందుకున్న కళాకారులుగా యక్షగాన ప్రదర్శనకు జీవగర్రలయి నిలిచారు. చివరకు వీరంతా భారతస్వాతంత్ర్యసంగ్రామ కాలం నాటికి చరిత్రపరిశోధకులకు భోగంవృత్తివారుగా, భాగవతులుగా వివిధ జాతుల పేర్లతో దర్శనమిచ్చారు. కొద్ది తెగలు మాత్రం అందుకు మినహాయింపుగా వున్నాయి.

పీరిని దక్షిణ భారత దేశంలో బౌద్ధ, జైన, వైదిక మతప్రచారకులుగా చరిత్ర పరిశోధకులు పేర్కొన్నారు. ఆంధ్ర కన్నడదేశాల్లో నేడున్న యక్షగాన కళా

రూపాన్ని బట్టి వాటిమధ్యనున్న అవినాభావ సంబంధాన్ని బట్టి పాదు ఒకటనే అభిప్రాయం కలుగుతుంది. ఈకళ వివిధ దేశాల్లో వివిధ పేర్లతో విరాజిల్లుతూంది. వీధినాటక ప్రక్రియగా వీరశైవ-వీరవైష్ణవ మతప్రచార కళారూపాలుగా కానవస్తుంది.

మానవునిలో పరిశోధన పరిశ్రమ సంస్కార సాధన రూపొంది ప్రతికళ శాస్త్ర బద్ధమైంది. అతను దినచర్యగా తిండి సంపాదనకు నేర్చిన కళలన్నీ వృత్తికళలై వాటిలో సున్నితమైనవి లలితకళలై నాటకావిర్భావం జరిగింది. లలిత కళలే ఆకర్షణను పెంచాయి. పాండిత్యాన్ని పెంచాయి. గౌరవాన్ని అందించాయి. లిపిరాయగలవారు ఛందస్సులో రాయడం, పాడగలవారు శాస్త్రీయంగా పాడటం, ఆడగల వారు లయబద్ధంగా ఆడటం, చిత్రలేఖనం శిల్పం అలవోకగా చిత్రించే వాటిని మూర్తిమంతంగా నిజస్వరూపాలు ఉట్టి పడేలా చిత్రించటంతో యక్షగాన ప్రక్రియ రూపుదిద్దుకుంది.

పద్య-గీత-గద్య సమన్వయంగా సాహిత్యం, చూపరులను తబ్బిబ్బుగావించే వేషధారణ, కర్ణపేయమైన రాగాలూ దరువులు, నయనానందకరంగా కళారాధకులకు గర్వకారణంగా గీతరాగ తాళబద్ధంగా సంగీత రూపకంగా యక్షగానం ప్రాచుర్యం పొందింది.

జానపద సంప్రదాయం నుండి అభివృద్ధి చెందిన ఈ యక్షగానం పరిమితమైన దైవలీలలు ప్రదర్శించటంతో ఆగక ప్రబంధ కావ్యవస్తువులను స్వీకరించి ఆలయ సంప్రదా

యాన్ని అధిగమించి రాజమందిరాల ఆదరణ పొంది పండిత పామరుల చేత లెస్స అనిపించుకుంది.

యక్షగానం పుట్టుటకు కారణం కురవంజి రూపక ప్రక్రియ కారణమని లాక్షణికులు పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు. కురవంజి ప్రక్రియ యక్షగానం కన్నా పూర్వం నుండీ వున్నది.

కు ర వం జి

జ్ఞాన కురవంజి, జీవకురవంజి, సత్యభామ కురవంజి అనే మూడు కృతులు ఈ ప్రదర్శనల్లో వున్నట్లు తెలుస్తున్నది. ఈ కురవంజి ఆట అటవీ ప్రాంతాలలో గల క్షేత్రాలను దర్శించుటకు వెళ్ళే నాగరికుల రాత్రి మజీలలో కురవంజీలు ప్రదర్శించి వినోదం కల్పించేవారు. వీరివృత్తి వేట అయినా అడవిలోని దారులు తెలియ చెప్పటం సహాయ పడటం, ఆటపాటలతో అలరించి వినోదింప చేయటం. కురవంజి అంటే కురవలోని స్త్రీ అని వివరణ ఇచ్చారు పండితులు. కురవ అంటే కొండకనుమ వాడుకలోని మాట.

ఇది తొలి తెలుగు నాటక రూపంగా భావించబడింది. సింగి,సింగడు పాత్రలు కథను గానం చేస్తూ హాస్య ప్రసంగాలు చేస్తూ జనులను రంజింప చేశారు. దీనిని చూచిన నాగరికులు యక్షగాన ప్రక్రియను రూపొందించారనే అభిప్రాయం కూడా పండితలోకంలో వుంది.

యక్షగానాలలో అత్యంత ప్రాచీనమయినదిగా గుర్తించినది "గరుడాచలం" దీని రచయిత ఓబయమంత్రి. యక్ష

గానం అనేది జక్కులు ప్రదర్శించేవారనే వాదన కూడా వుంది. గరుడాచలం చెంచులక్ష్మి నాటకం.

## జక్కుల పురంధ్రి

జక్కులవారు కళాకారులుగా వృత్తిచేత జీవించే వారుగా తెలియచేయబడింది. యక్షగానాన్ని జక్కులు తమదైన రూపకంగా ఒక బాణీగా స్వీకరించారు.

వీరు చరిత్రలో, కావ్యాల్లో కానవస్తున్నారు. జక్కులు కుటుంబసమేతంగా ఈ యక్షగానం ప్రదర్శిస్తారు. జక్కుల పురంధ్రి అంటే జక్కుల జట్టు నాయకురాలు అని, బిడ్డలు గల ఆడదని పేర్కొనబడింది. నేడు జక్కు శబ్దంతో ఇంటిపేర్లు, గ్రామాల పేర్లు వున్నాయి.

“రాగమున నుండి లంఘించు రాగమునకు
సురటియూరు ద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లి, మహాలక్ష్మి, కైటభారి
వలపు బాడుచు వచ్చె జక్కుల పురంధ్రి”
అని ఒక కవి వర్ణించాడు. (శ్రీనాథుడు)

బ్రిటిషు వారు భారతజాతుల గురించి వ్రాసిన గ్రంథాలలో వారి జీవిత విధానం హీనపడింది. వ్యభిచార జాతిగా కళాకారులుగా యాచక వృత్తిగా వున్న వారిగా తెలుప బడింది.

జక్కులు ఆనాడు వారికి గ్రామాలలో అందుబాటుగా వున్న కవుల చేత యక్షగానాలు వ్రాయించుకొని ప్రదర్శ

చారు. అవి చూచి మంత్రివర్యులు, రాజులు మెచ్చుటవల్ల రాచ నగరులకు ఈ కళను చేర్చేసరికి వారి స్థాయి పెరిగింది. తంజావూరు నాయక రాజుల కాలంలో యక్షగానం మూడు పువ్వులు ఆరుకాయలుగా వికసించింది.

యక్షగానాలు, గీతరూపక ప్రక్రియలు. ప్రదర్శించిన సందర్భాలు ప్రదర్శించదగిన సందర్భాలు ఇలా వున్నాయి.

ప్రధానంగా ఇష్టదేవతారాధన ప్రచారంకోసం అవతరించి కళాకారుల పోషణకొరకు ప్రజలమధ్యకు నడిచి సంగీతనాట్యాలు వృత్తిగా మారి కొందరికి కులవృత్తిగా తయారయింది.

యజ్ఞాలు - దైవారాధనలు - పితృకర్మలు - వివాహ వేడుకలు, పండిత సత్కారాలు, రాచమర్యాదలు ఈ కళాపోషణకు సముచిత సందర్భాలుగా ఏర్పాటయ్యాయి.

యక్షులు జక్కులుగా మారి రాచరికపు చెలిమి చేర్చుకుంటే, కూరవంజిలు భాగవతులుగా మారి జన జీవితంలో భాగమైనట్లు కానవస్తుంది. ఈ జాతులనుండే కళారాధకులు అనేక కళారూపాలను జనులభిరుచిలో భాగంగా విలువరించారు.

మొత్తంగా కళాకారులు రాజప్రాసాదాల్లో చేరిన వారు ప్రథమశ్రేణిగా, వ్యాపారుల పోషణలో చేరినవారు రెండవ శ్రేణిగా, భూస్వామ్య వర్గాలను ఆశ్రయించినవారు మూడవ శ్రేణిగా, దిగువతెగతులను ఆశ్రయించినవారు నాల్గవశ్రేణిగా జీవితాలు వెళ్ళమార్చినట్లుగా కలబడుతుంది.

ఆస్థాన వర్తకి పదిసుంది బోయీల పల్లకీలో వెళ్ళటం ఘనం, అందుచేత అందరూ రాణివాసపు పల్లకీలకోసం ఆరాటపడినట్లు కానవస్తుంది పురుష భాగవతులు తప్ప.

పరిశోధకులకు ఎదురైన ఇబ్బందులు

మన పూర్వ పండితులంతా కవిత్వం చెప్పారేగాని చరిత్ర చెప్పలేదు. అందుచేత నేడు మనకు దీని తరువాతి ఇది. దీని రూపం ఇది అని నిక్కచ్చిగా వక్కాణించే అవకాశం అందుతున్న గ్రంథాలు అందించటంలేదు. పరిశోధకులు కూడా ఇది మాత్రమే యక్షగానం. ఇదికాదు అని చెప్పడానికి ప్రామాణికమైన గ్రంథాలు లభ్యంకాలేదు. అనేక గ్రంథాలలో దొరకిన యక్షకన్యలు, జక్కుల పురంధ్రులు వంటిపదాలు దొరికిన మేరకు యక్షగానాలు పరిశీలించి: సంకీర్తనం-భజన సంబంధమని, పదగానం జానపద సంబంధమని, కలాపం ప్రబంధ నాయిక సంబంధమని. యక్షగానం నాటక ప్రక్రియ అని నిర్ధారించారు.

మరికొందరు ఇంకొంచెముందుకు పోయి బుర్రకథ, జముకులకథ, హరికథలు-ఆడపాడి కథచెప్పే అన్నిప్రక్రియలు కూడా యక్షగానాలేనన్నారు.

పోమకుల అభిరుచి మేరకు, ఏకపాత్ర కేళిక పద్ధతి కూడా యక్షగాన అంశంగా కానవస్తున్నది

యక్షగానంలో స్త్రీ పురుషులు నటించినట్లు తెలుస్తున్నది. స్త్రీపాత్రలు స్త్రీలూ, పురుషులూ కూడా ధరించారు. హంగుదారులు పురుషులు. వాయిద్యకారులు స్త్రీలు పురుషులుకూడా వుండటం కద్దు.

## కన్నడ యక్షగానం

కన్నడ యక్షగానంతో మనకు ముడివీడని సంబంధం కనిపిస్తుంది. ప్రతిభాషకు ప్రతి లలితకళకు పరిసర ప్రభావం విధిగావుంది. అదేవిధంగా కన్నడ లిపితో లిపికి- కన్నడ- తెలుగుయక్షగానాలకు సారూప్యంవుంది.

కన్నడ యక్షగానంలో పురుషపాత్రలకు కథకళీ వేషధారణ- శైవ సంబంధమైన సంగీతరచన- భరత శాస్త్రసంబంధమైన నృత్యరచనా కానవస్తాయి.

నడకలో తెలుగు కన్నడ యక్షగానాలకు తేడాలు కానరావు. రాజు ప్రవేశం పాంగుదారులు అట్టహాసం వంటి పాటకులు బృందగానం మామూలే. ప్రధానపాత్ర అభినయానంతరం వంతపాడే బృందంతో గొంతు కలుపుతుంది. వీనిలో అదనపు లక్షణం పురుషపాత్రే స్త్రీ గీతం తరువాత భ్రమర భంగిమలు విధిగా ప్రదర్శిస్తాయి.

### ప్రసిద్ధ రచనలు

గీతరూపకానికి ఆద్యుడు అశ్వఘోషుడే అయినా అతని రచన ఊర్వశీవియోగం ప్రచారంలో లేదు.

జయదేవుడు రచించి సంగీత నృత్యాలను కూర్చి ప్రదర్శింపచేసిన **గీతగోవిందం** మాత్రం భారతీయ భాషలన్నింటా ప్రచారంలో వుంది. ఇదీ యక్షగాన రూపకము. సిద్ధేంద్రుని శ్రీకృష్ణ లీలా తరంగిణి భామాకలాప యక్షగానంగా గుర్తింపు పొందింది.

సిద్ధేంద్రయోగి కారణంగా తెలుగుదేశంలో కూచిపూడి (బ్రాహ్మణ) భాగవతులు వెలిశారు. వీరిలో ప్రసిద్ధులు

సంస్కృత ఆంధ్రభాషలు నేర్చి—నృత్య సంగీత ఛందో శాస్త్రాలు అభ్యసించి, కూచిపూడి యక్షగానం రీతిని ప్రచారంలో వుంచారు. వీరిని అనుసరిస్తూ గొల్ల భాగవతులు, మాల భాగవతులు, యానాది భాగవతులు ఇత్యాది తెగలు అవతరించాయి.

యక్షగానం గురించి సంగీతసుధ, భీమేశ్వరపురాణం కవిరాజమార్గం, క్రీడాభిరామమునే గ్రంథాల్లో పేర్కొన్నట్లు కనబడతున్నది.

రాజాశ్రయం పొందిన కళాకారులు ఒక దురవస్థకు గురైనారు. రాజులు ఓడిపోయినపుడు గెలిచినవారు ఆ కోటలను స్వాధీనం చేసుకున్న తరుణంలో కోటభద్రత పేర అందరినీ పేటలకు తరిమి వేశేవారు. వారు బహుకొద్ది అందగత్తెల్ని పాండిత్యం గలవారిని స్వీకరించేవారు. ఈ రకంగా ప్రభువులనిరాదరణ పొందిన కళాకారులు వ్యాపార భూస్వామిక వర్గాల పంచల పట్టున చోటులేక వెనుకబడిన వర్గాలలో చేరి వారిలో కలిసిపోయారు.

## గీత నాటికలుగా నామరూపం

గేయ రూపకాలుగా పేరుపొందిన గేయనాటికలు సంగీత ప్రధానమైనవికొన్ని, నృత్య ప్రధానమైనవి కొన్ని వున్నాయి.

నాట్యాచార్యులు వ్రాయించుకున్నవి నృత్య రూపకాలుగానూ, పత్రికలు రేడియోలు ఆదరించినవి సంగీత రూపకాలుగానూ వున్నాయి. ఆధునిక ప్రక్రియల్లో అనేక

సాంఘిక కథావస్తువుల సంస్కార భావాలు తిరుగుబాటు ఆలోచనలకు వేదిక అయినాయి. వాటిలో కొన్ని ప్రయోగం పొందాయి. చాలా భాగం పత్రికలకే పరిమితమయినాయి.

1944లో ప్రజాశక్తిలో ప్రచురించబడిన "భూదేవి స్వయంవరం" పేర్కొనదగింది. దీని రచయిత శ్రీ అయ్యావు వెంకట కృష్ణయ్య. భూదేవి తనను వరించవచ్చిన ప్రతివక్కరినీ "కూడు పుట్టించేది నీవా? లోకంపుగోడు గమనించేది నీవా?" అని ప్రశ్నిస్తుంది. ప్రతి నాగరికుడ్ని అతని అసమర్ధతను స్వార్ధాన్ని నిలదీసి ప్రశ్నిస్తుంది, చివరకు ఒక రైతును వరిస్తుంది.

## రేడియోలో సంగీత రూపకాలు

రేడియో ప్రసారాలు పెరగడం ప్రసార కేంద్రాలు పెరగటంతో సంగీత రూపకాలు పెరిగాయి. అనేకమంది రచనలు ప్రసారం చేయబడ్డాయి. వీరిలో దేవులపల్లి కృష్ణ శాస్త్రి, నింజమూరి శివరామారావుగార్ల సంగీత రూపకాలు ప్రశస్తి పొందాయి.

సినిమాలలో కూడా కొందరు దర్శకులు బాలల నీతి బోధలుగా ప్రచారం పొందిన కథలను నృత్య నాటికలుగా పరిచయం చేశారు.

## ఆధునిక గేయ రూపకాలు

ఆధునిక గేయ రూపకాల్లో రాజకీయ ప్రభావంకలవి శ్రామిక జనుల సమస్యల గురించి చిత్రించబడ్డాయి.

తొలుత శ్రీ బి. వి. నరసింహారావు గారిచే కొనకళ్ళ వెంకట రత్నంగారి 'రోడ్డు రోలరు' గేయం నృత్య రూపకం చేయబడింది.

ప్రజానాట్యమండలి వారి 'హిట్లర్ భాగవతం' ప్రదర్శించబడింది. 'ప్రెస్ వర్కర్' ప్రదర్శించబడింది. 'శాంతి' మూకీ నాటకం ప్రదర్శించబడింది. తొలిసారిగా సినిమా రంగంలో పల్లెటూరు చిత్రంలో శ్రీ శ్రీ రచన ప్రతిజ్ఞ నృత్య రూపకం చేయబడింది.

తరువాత నాట్యాచార్యుడు సంపత్ కుమార్ చే శ్రీ శ్రీ రచనలు ఇతర రచనలు నృత్యరూపకాలు చేసి ప్రతిభావంతంగా ప్రదర్శించబడుతున్నాయి.

జన నాట్యమండలి శ్రీ వంగపండు ప్రసాద్ వ్రాసిన "భూమి భాగోతం" ప్రదర్శించారు. దానిని ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి స్వీకరించి విస్తృత ప్రచారంలోకి తెచ్చింది.

## పాఠశాలలు

పాఠశాలల్లో ప్రధానోపాధ్యాయుల అభిరుచినిబట్టి— నృత్య పాఠశాలల్లో వారి అభిరుచినిబట్టి సంగీత రూపకాలు సంఖ్య పెరుగుతూ వస్తున్నవి. ఇది చాలా సంతోషించదగిన విషయమే.

# నృత్య నాటికలు

## బాగా ప్రచారం పొందిన నృత్యనాటికలు యక్షగానాలు

సుగ్రీవ విజయం
పారిజాతాపహరణం
రామనాటకం
హరిశ్చంద్ర
భక్త ప్రహ్లాద
ఉషా పరిణయం
విప్రనారాయణ
ప్రహ్లాద విజయం
పద్మావతీ శ్రీనివాసం
రుక్మిణీ కల్యాణం
కుమార సంభవం
క్షీరసాగర మధనం
మేనకా-విశ్వామిత్ర
మోహినీ భస్మాసుర
గిరిజా కల్యాణం
సీతాకల్యాణం
అభిజ్ఞాన శాకుంతలం
శ్రీకృష్ణ పారిజాతం
శాకుంతలం
గోపికా కృష్ణ
లలితావిజయం
కూర్మావతారం
మీనాక్షి విజయం
శబరి మోక్షం
మహా పట్టాభిషేకం
కల్యాణ శాకుంతలం
శివమోహిని
అర్ధనారీశ్వరుడు
అన్నమయ్య చరిత
నౌకాభంగం
కాబూలీవాలా
అర్ధేచానాతి చరామి

త్యాగయ్య | భూ భాగోతం
ఛండాలిక | అభినవ భస్మాసుర
 | జనశ్రేణి కదిలింది

ఇంకా మరెన్నో వున్నాయి.

కళారాధనలో జీవన శోభను—ప్రజాసేవలో సమర శీల దీక్షను—ప్రపంచశాంతి పరిక్షణను సామ్యవాద సమాజాన్ని సాధించాలని రచయితలు కళాకారులు సరికొత్త కళా రూపాలు తెస్తున్నారు.

అవస్థా యా తు లోకస్య సుఖ-దుఃఖసముద్భవా
నానాపురుషసంచారా నాటకేఽసౌ విధీయతే ॥

"లోకంలోని సుఖదుఃఖాలు, నానాపురుష సంచారముగలది నాటకంగా" పేర్కొన్నారు.

న తజ్జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా
న తత్ కర్మ న వా యోగో నాట్యేఽస్మిన్యన్న దృశ్యతే॥

"జ్ఞానం, శిల్పం, విద్య, కళ, కర్మ, యోగములు నాట్యంలో దృశ్యమానమై యున్నవని" పేర్కొన్నారు.

యస్మాత్ స్వభావం సంత్యజ్య సాంగోపాంగగతిక్రమైః
ప్రయుజ్యతే జ్ఞాయతే చ తస్మాద్వై నాటకం స్మృతం ॥

"సర్వ స్వభావములు సర్వ రసములు, సాంగోపాంగ మైన గతిక్రమం చేత జ్ఞాన ప్రదాయకమైన ప్రయోగంగా నాటకం రూపు ధరించాలి" అనీ పేర్కొన్నారు.

నాటకం గురించి నాట్యశాస్త్రకారులు చాలా స్పష్టంగా వివరించారు. తెలిసినా తెలియక పోయినా ప్రతి వారూ దానినే నేడు ఆశ్రయించారు.





## 'శ్రీ మైత్రేయ'

పంగులూరి కృష్ణమూర్తి
జననం : 11-4-1934 ప్రకాశం జిల్లా
జీవనం : 1946 నుండి విజయవాడలో
సాహితీక్షేత్రంలో
కథ, నవల, నాటకం, నాటిక, వ్యాసావళి,
బాలసాహిత్యం, ప్రయోజన విద్యాంశం,
సాహితీ విమర్శ, గేయ రచన, సంగీత రూపకాలు.
నాటక సాహిత్యములో గురువులు శ్రీనివాస చక్రవర్తి
1950-55 ఔత్సాహిక నటుడిగా
1968 తిరుపతి శ్రీ వెంకటేశ్వర నాటక కళా పరిషత్తులో
ఉత్తమ నటుడుగా
1964 నుంచి నాటక పరిషత్తులలో న్యాయ నిర్ణేతగా—
అభ్యుదయ రచయితల సంఘంలో
ఆంధ్రప్రదేశ్ ప్రజా నాట్యమండలిలో క్రియాశీల కార్యకర్తగా
సోషలిస్టు సమాజ స్థాపన పథంలో రాజకీయ జీవితంతో
సంఘసేవలో ప్రజల మధ్య నడుస్తున్నారు.

